## ప్రజ్ఞా పారమిత సూత్రం

# వజ్రచ్ఛేదిక

# DIAMOND SUTRA






బోధ చైతన్య




**అనంద బుద్ధ విహార ట్రస్ట్**

బుద్ధనగర, తుకారాంగేట్, నార్త్ లాలాగుడా, సికింద్రాబాదు - 500 017,
ఎ.పి., ఇండియా. ఫోన్ : 040-7732421, ఫ్యాక్స్ : 040-7733160.

నమో తస్స భగవతో అరహతో సమ్మా సంబుద్ధస్స



ఈ గ్రంథ ప్రచురణకు తమ అమూల్య సహాయ, సహకారాలందించిన
సహృదయిలు ప్రియా సిమెంట్ అధినేతలు, శ్రీ సుజిత్ రెడ్డి గారు
ఆయురారోగ్యాలతో వర్థిల్లాలని, సర్వతోముఖ
ప్రగతి సాధించాలని ఆకాంక్షిస్తున్నాము.



# విషయ సూచిక

# తొలిపలుకు

మహాపరినిర్వాణం తరువాత మహాకాశ్యపుని అధ్యక్షతన 500 అర్హతులు రాజగృహంలో ఆరు నెలలపాటు సమావేశమై బుద్ధుని వాక్యాలను సూత్రంగా (teachings) వినయంగా (discipline) సంకలనం చేశారు. ఈ సమావేశానికి ప్రథమ సంగీతి* (first council) అని పేరు. ప్రథమ సంగీతిలోనే పురాణుడనే భిక్షువు ఆ సంకలనం పట్ల తన అసమ్మతిని క్రింది విధంగా ప్రకటించాడు: "భదంతులారా, మీరు చేసిన సంకలనం చాలా బాగున్నది. బహుజన హితానికి సుఖానికి దారి చూపుతుంది. కానీ నేను తథాగతుల ముఖతః స్వయంగా విన్న దివ్య సందేశాలను మాత్రమే శిరసావహిస్తాను". ఈ ఉదంతం వల్ల ప్రథమ సంగీతి సంకలనంలో చేరకుండా నిలిచిపోయిన సూత్రాలు కూడా ఉన్నట్లు తెలుస్తున్నది. ప్రథమ సంగీతి నిర్ధారించిన సూత్రపిటకంలోనే అనేక చోట్ల మహాయాన భావాలు సంక్షిప్తరూపంలో ఉన్నాయి. ఆ సంక్షిప్తరూపాలకు విపులీకరణమే మహాయానం.

- పాఠ్యపుస్తకాల్లో కనిపించే హీనయానం అనే శోచనీయ పదం మూల మహాయాన గ్రంథాల్లో ఎక్కడా కనిపించదు. శ్రావకయానం, ప్రత్యేకబుద్ధయానం, బోధిసత్త్వయానం అనే పదాలే కనిపిస్తాయి. శ్రావకయానం అనేది కాలాంతరంలో 18 శాఖలుగా విస్తరించింది. ఈ శాఖల్లోని కొన్ని శాఖలకు చెందిన భిక్షువులు కొందరివల్ల మహాయాన భావాలు ప్రచారంలోకి రావడం మొదలయ్యింది. క్రీ.శ. 6వ శతాబ్దంలో భారతదేశాన్ని పర్యటించిన చైనాదేశీయ భిక్షువు I-tsingకు బౌద్ధవిహారాల్లో శ్రావకయానీయ భిక్షువులు, మహాయానీయ భిక్షువులు కలిసి నివసించడమే కనిపించింది.

మహాయాన సూత్రాల సంఖ్య వందకు పైగానే ఉన్నది–ప్రజ్ఞాపారమిత వర్గం, రత్నకూట వర్గం, అవతంసకవర్గం అని.

ప్రజ్ఞాపారమిత వర్గంలో (collection) శతసాహస్రిక ప్రజ్ఞాపారమిత అనే లక్ష శ్లోకాల పెద్ద గ్రంథం నుండి ఏకాక్షర ప్రజ్ఞాపారమిత అనే చిన్న గ్రంథం వరకు మొత్తం

---

*సంగీతికి literal meaning is group chanting.

పెద్దవి చిన్నవి మధ్యరకానివి కలిపి సుమారు 40 గ్రంథాలున్నాయి. ఇందులో వజ్రచ్ఛేదిక ప్రజ్ఞాపారమిత సూత్రం ఒకటి. ప్రజ్ఞాపారమిత వర్గంలో ఈ సూత్రానికి మరియు హృదయ సూత్రానికి ఆదరణ చాలా ఎక్కువ. ఇవి పారాయణ (the way across) గ్రంథాలుగా ప్రసిద్ధి చెందాయి.

Edward Conze గారు Buddhist Wisdom Books పేరున వజ్రచ్ఛేదికను, హృదయ సూత్రాన్ని అనువదించారు. Unwin Brothers Ltd, London వారు ప్రచురించారు. ఈ పుస్తకాన్ని నేను సహాయంగా తీసుకొన్నాను. అనుబంధంలో మూల సంస్కృత గ్రంథానికి ఇచ్చిన ఆంగ్లానువాదం Edward Conze గారిదే.

చైనా భాష నుండి ఆంగ్లంలోకి అనూదితమైన మరో గ్రంథ సహాయమూ తీసుకొన్నాను. The Diamond Sutra and Sutra of Hui–Neng translated by A.F.Price and Wong Mou–mam, published by Shambhala publications, Bostan. ఈ గ్రంథం నుండియే ఆరవ గురువుగారి ఆత్మకథను తీసుకొని సంక్షిప్తం చేశాను.

సంస్కృతమూలాన్ని యథాతథంగా తెలుగులోకి అనువదించాను. అనువాదం భాష కాస్త భిన్నంగా కనబడడం కోసం భాషాపద్ధతి కొద్దిగా మార్చుకొన్నాను. ఇక అవతారికలు నేను చేసిన ప్రయోగంగా భావించవచ్చు. మూలగ్రంథ అనువాదమే చదువదలచినవాళ్లు అవతారికలు వదలి వేయవచ్చు. continuity దెబ్బతినదు. కానీ ఒక చిన్న సూచన. అనుబంధంలో ఇచ్చిన మూలాన్ని చదివి ఆపైన అనువాదం చూడడం మంచిది. ఇది పారాయణ గ్రంథం కూడా కనుక మూలాన్ని చదవడాన్ని పాఠకులు అభ్యాసం చేసుకోవాలి. అనుబంధంలో ఇచ్చిన మూలగ్రంథ పాఠం Central Institute of Higher Tibetan Studies, Saranath, Varanasi వారు ప్రచురించిన వజ్రచ్ఛేదిక హిందీ అనువాద సహితం పుస్తకం నుండి గ్రహించాను. Edward Conze గారి ఆంగ్లానువాదానికి ఈ మూలగ్రంథానికి తేడా చాలా స్వల్పంగా ఎక్కడో ఒకటి రెండు చోట్ల ఉండవచ్చు– పాఠభేదం వల్ల.

# ఉపోద్ఘాతం

వజ్రచ్ఛేదిక ప్రజ్ఞాపారమిత సూత్రం 9600 అక్షరాల చిన్న గ్రంథం (32x300). దీని ఉపయోగం ఏమిటంటే: మనలో సత్కాయదృష్టి (individuality view) అనే మహాపర్వతం–ఇరవై శిఖరాల మహాపర్వతం తిష్ఠ వేసి యున్నది. దాని వల్లనే అన్ని బాధలు. ఈ అజ్ఞాన మహాపర్వతాన్ని ఛేదించే వజ్రాయుధంగా ఈ గ్రంథాన్ని పూర్వీకులు భావించి దీనికి వజ్రచ్ఛేదిక అని పేరు పెట్టారు. ఇంగ్లీషులో Diamond sutra / Diamond cutter sutra / Sutra which cuts like a Thunderbolt అని పేర్లు. శూన్యతకు (emptiness) వజ్రం అనే రహస్య నామధేయం ఉంది కనుక వజ్రచ్ఛేదిక అంటే శూన్యతాశస్త్రం లేదా ప్రజ్ఞాయుధం అని కూడా అర్థం ఇచ్చుకోవచ్చు. ప్రజ్ఞకు సాకార రూపమైన మంజుశ్రీ చేతిలో పొడవైన ఖడ్గం కనిపిస్తుంది. ఆ ఖడ్గమే వజ్రచ్ఛేదిక అనుకొన్నా సరిపోతుంది.

ప్రజ్ఞ (wisdom) అంటే ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకొనే చిత్తవిశేషము. అదనంగా ఏమీ కలపకుండా (సమారోపం = adding లేకుండా), ఏమీ తీసివేయకుండా (అపవాదం = minus చేయకుండా) ఉన్నది ఉన్నట్లుగా చూడగల కౌశలాన్నే (skill) ప్రజ్ఞ అంటారు. ఈ ప్రజ్ఞ పరిపూర్ణంగా ఉంటే ప్రజ్ఞాపారమిత (perfection of wisdom) అనబడుతుంది. బాధలనుండి, కష్టాలనుండి నిరాశా నిస్పృహలనుండి దైన్యంనుండి మనిషిని దాటిస్తుంది అనే అర్థంలోనూ పారమితను (transcendent) చెప్పుకోవచ్చు.

ప్రపంచంలో తొట్టతొలుతగా ముద్రితమైన గ్రంథంగా వజ్రచ్ఛేదికకు ప్రసిద్ధి. క్రీ.శ. 864 వ సంవత్సరం, మే నెల 11వ తేదీనాడు చైనాలో ఇది ముద్రణ పొందింది. మహాయానం వ్యాపించిన దేశాల్లో ఇది పారాయణ గ్రంథం. చైనా, టిబెట్, మంగోలియా, కొరియా, జపాన్, వియత్నామ్ దేశాల్లోని బౌద్ధులు ఈ గ్రంథాన్ని భక్తి శ్రద్ధలతో పఠిస్తారు.

ఋషి ప్రోక్తములను (uttered by a sage) భక్తి శ్రద్ధలతో పఠిస్తే కలిగే ప్రయోజనాన్ని ఇంత అంత అని కొలవలేము. వేయి మైళ్ల దూరం నడచి పోదలచినవాడు చేయవలసిన మొదటి పని అడుగు వేయడమే. ఈ గ్రంథాన్ని పఠించడం ద్వారా అధ్యాత్మికంగా మొదటి అడుగు వేసి ముందుకు పోదాము.

ఈ గ్రంథం చిన్నదైనా చైనా బౌద్ధులు దీనిని 32 భాగాలుగా విభజించారు. ఈ అనువాదంలో ప్రతి భాగానికి అవతారిక (introduction) ఇచ్చి ఆపైన మూలగ్రంథ భాగాలను సరళంగా అనువదించడం చేస్తాను. అనుబంధంలో మూల సంస్కృత గ్రంథాన్ని తెలుగు లిపిలో ఇంగ్లీషు అనువాదంతో పాఠకుల సౌకర్యం కోసం పొందుపరచాను.

వజ్రచ్ఛేదికను వివరించడం కోసం మహాయాన శాస్త్ర గ్రంథాల విచార పద్ధతులను చొప్పించాలని మొదట అనుకున్నాను కానీ అలా చేస్తే విషయం తేటతెల్లం కావడానికి బదులు మరింత జటిలం అయిపోవచ్చనే సంశయంతో ఆ ప్రయత్నాన్ని మానుకొన్నాను. బుద్ధుని వాక్యాలను స్వయంగానే అర్థం చేసుకొంటే ఆ అర్థమయినట్టిది జీవితంలో భాగం అవుతుంది. భిన్నభిన్న మనస్తత్వాలకు సరిపడే విధంగా బుద్ధుని ఉపదేశాలు భిన్నభిన్నంగా ఉంటాయి. "ఈ ఉపదేశం నాలాంటివాడికే" అని భావించుకొని పాఠకులు ఈ వజ్రచ్ఛేదికను తమకు తోచిన రీతిలోనూ అవగాహన చేసుకొనవచ్చును. బుద్ధుడు ఉపాయ కౌశల్యంతో (skill in means) వినేయజనుల (trainees) దుఃఖ విముక్తి కోసం బోధనలు నానా విధాలుగా చేశాడు. ఆ వినేయజనుల్లో "నేనూ ఒకడిని" అనుకొని గ్రంథాన్ని పఠించాలి. బుద్ధుని ఉపాయ కౌశల్యాన్ని తెలిపే ఉపమలను* (parables) రెంటిని సద్ధర్మ పుండరీకం నుండి తీసుకొని పాఠకులకు అందిస్తున్నాను. ఈ రెండు ఉపమలు, మరియూ హుయ్-నెంగ్ (637–713) ఆత్మకథ పాఠకులను వజ్రచ్ఛేదిక పఠనానికి తగిన విధంగా సంసిద్ధం చేయగలవని భావిస్తున్నాను.

* * * *

---

*ఉపమ = literary device

## ఏకయానం

ఒకానొక నగరంలో ధనికుడైన గృహపతి ఉన్నాడు. అతనికి ఒక పెద్ద భవనం ఉన్నది. అంత పెద్ద భవనమైనా దానికి ఉన్నది ఒకే ఒక ద్వారమే. ఒకనాడు ఆ భవనానికి నిప్పంటుకొని అన్ని వైపులా జ్వాలలు వ్యాపించాయి. గృహపతి వెంటనే క్షేమంగా బైటకు వచ్చేశాడు. "హమ్మయ్య, బ్రతికి బయట పడ్డాను" అని అతను సంతుష్టి చెందలేదు. ఇలా విచారించాడు:

నాకు బలం ఉంది కనుక ఈ అగ్నిజ్వాలల్లో చిక్కుకోకుండా దగ్ధం కాకుండా బైటకు రాగలిగాను. కానీ నా పిల్లలు భవనం లోపల రకరకాల ఆటల్లో మునిగియున్నారు. ఈ భవనాన్ని జ్వాలలు చుట్టుముట్టి యున్నాయనే భయంకర సత్యాన్ని గమనించకుండానే చిత్తాలను ఆటల్లో లగ్నం చేసియున్నారు. నాకు బలం ఉంది, శక్తి ఉంది. లోనికి వెళ్లి నేను వాళ్లనందర్నీ నా మూపున పెట్టి తీసుకురాగలను. కానీ వాళ్లు నా చేతికి అందుతారా? ఆటలాడుకోనీయకుండా అడ్డు పడుతున్నాడని ఆ చపలురు, చంచలురు, బాలజాతీయులు (foolish fellows) నన్ను ధిక్కరిస్తారు. నాచేతికి అందకుండా ఇటుఅటూ ఈ భవనంలోనే పరుగులు తీస్తారు. ఏమి చేయాలి? సరే, వాళ్లను ఇక్కడ్నుంచే హెచ్చరించి చూస్తాను" అనుకొని "బాలకులారా, ఈ భవనం అగ్నిజ్వాలలచే ఆదీప్తమై ఉన్నది. ఆలస్యం చేశారంటే మాడి మసి అవుతారు. వేగిరంగా బయటకు వచ్చేయండి" అని అరచి చెప్పాడు. భవనంలోని ఆ బాలజాతీయులు (foolish fellows) ఆ హెచ్చరికను ఖాతరు చేయలేదు. "ఏమిటీ గోల (nuisance)" అని విసుక్కొంటూ ఆటల్లోనే ఉండిపోయారు. ఇక లాభం లేదనుకొని గృహపతి ఒక ఉపాయం ఆలోచించాడు. ఆ బాలస్వభావుల రుచులు (tastes and interests) ఏమిటో అతనికి తెలుసు. ఆ రుచుల గాలం వేసి వాళ్లనందరినీ బైటకు లాగాలనుకొన్నాడు. "కుమారులారా, ఇదిగో మీకిష్టమైన ఆటవస్తువులు–గోరథాలు, ఒంటె రథాలు, జింక రథాలు తెప్పించాను. వేగంగా రండి. వచ్చి తీసుకోండి. ఆలస్యం చేశారంటే ఇంకెవరైనా వచ్చి పట్టుకెళ్లిపోతారు" అని అరచి చెప్పాడు. ఆ ఆకర్షణ వచనాలను వినీవినగానే ఆ బాలకులందరూ "నేను ముందు నేను

ముందు" అని ఒకరితో ఒకరు పోటీ పడుతూ భవనం వెలుపలికి పరుగెత్తుకొని వచ్చేశారు. గృహపతి చాలా ఆనందించాడు. కానీ ఆ బాలకులకు నానా రకాల బొమ్మ రథాలకు బదులు చక్కని గోరథాలను నిజమైనవాటిని ఒకే విధంగా ఉన్నవాటిని తలా ఒకటి చూపించాడు. గృహపతికి మృషావాదదోషం (falsehood) అంటగట్టడానికి లేదు. పిల్లల క్షేమం కోరి ఉపాయకౌశల్యాన్ని (skill in means) ప్రదర్శించాడు. అలాగే బుద్ధుడు కూడా నానా రకాల వినేయ జనులను (trainees) త్రివిధ దుఃఖజ్వాలల నుండి బయటు పడవేయడం కోసం వారివారికి సరిపడే (suitable) శ్రావకయానం, ప్రత్యేకబుద్ధయానం, మహాయానం బోధనల ద్వారా వాళ్లను బయట పడవేసి ఆపైన అందరికీ ఒకే యానం–బుద్ధయానం చూపించాడు.

* * * * *

## దరిద్రపురుషుడు

దరిద్రపురుషుడు చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడు తండ్రి మీద అలిగి ఇంటిని వదలి దేశాంతరం వెళ్లిపోయి పాతికేండ్లు ఎలాగో బ్రతుకును ఈడ్చుకొంటూ వచ్చాడు. బ్రతుకు మరీ దుర్భరం అయిపోయింది. పని దొరకడం లేదు. పొట్టపోసుకొనేందుకు ఆ దరిద్రపురుషుడు పనులు వెదుక్కుంటూ జనపదం నుండి జనపదానికి తిరుగుతున్నాడు. దరిద్రపురుషుడు పాతికేండ్ల క్రితం ఇల్లు వదలిన కొన్నాళ్లకే అతని తండ్రి కూడా స్వస్థలం వదలి వేరే నగరం చేరి అక్కడ చిన్న వాణిజ్యం మొదలు పెట్టాడు. అదృష్టం కలిసి వచ్చి అతడు కొన్నేండ్లకు మహాధనికుడయిపోయాడు. ఇంద్రభవనాన్ని తలదన్నే విధంగా కనిపించే అతని భవనం వందలకొలది పరిచారక జనంతో ఎప్పుడూ కోలాహలంగా ఉంటుంది. ఎంత సంపద చేరినా అతని హృదయంలో వెలితిని అది పోగొట్టలేకపోయింది. ఇల్లు వదలి పారిపోయిన పుత్రకుణ్ణి అనుదినం స్మరిస్తూ ఉండేవాడు. "నేనిప్పుడు జీర్ణుడనయ్యాను, వృద్ధుడనయ్యాను, మహల్లికుడనయ్యాను. ఈ అవసాన దశలో ఎన్నో ఏండ్ల క్రితం నష్టపోయిన నా కుమారుడు తటాలున కనిపిస్తే ఎంత బాగుండును! అతనికి ఈ సమస్త సంపదను అప్పగించినపుడు కలిగే ఆనందాన్ని

అనుభవించే రాత నా నుదట ఉందో లేదో? బాబూ, ఎక్కడున్నావురా?" అని పరితపిస్తూ ఉండేవాడు.

దరిద్రపురుషుడు పని వెదుక్కుంటూ ఆ నగరం వచ్చి చేరాడు. ఆ నగర పౌరుడొకడు అతని దీనస్థితికి జాలి చెంది "ఓయీ దీనుడా, అదిగో కనిపిస్తున్నదే మాయామహలు లాంటి ఆ పెద్ద భవనం. అక్కడికి వెళ్లావంటే నీకు ఏదో ఒక పని తప్పక దొరుకుతుంది" అన్నాడు.

దరిద్రపురుషుడు ఆ భవనాన్ని సమీపించాడు. భవన మహాద్వారం ముందు రత్నఖచిత బంగారు సింహాసనం మీద ఠీవిగా ఆసీనుడైయున్న వృద్ధ తేజోమూర్తిని చూశాడు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ప్రముఖులు అనేకమంది ఆయన ముందు చేతులు కట్టుకొని నిలబడి ఏవేవో విజ్ఞాపనలు చేస్తుండడం కూడా చూశాడు. ఆ దృశ్యాన్ని చూడగానే దరిద్ర పురుషుడు బెదిరిపోయాడు. అది ఒక రాజదర్బారు అనుకొన్నాడు. రాజభటులు చూశారంటే చావగొట్టారేమో అని భయపడి "ఇంకొక క్షణం కూడా ఇక్కడ నిలబడి యుండడం క్షేమం కాదు. వెంటనే ఇక్కడ్నుంచి ఏ దరిద్ర వీధికైనా వేగంగా వెళ్లిపోవడం మంచిది" అనుకొని పరుగెత్తాడు.

ఆ మహాధనిక వృద్ధుడు అతణ్ణి చూడగానే తన కుమారుడే అతడు అని గుర్తించాడు. తప్పిపోయిన కుమారుడు చిరకాలానికి మళ్లీ కనబడగానే అతడు తుష్టుడయ్యాడు (contented). ఉదగ్రుడయ్యాడు (elated). ఆత్తమనస్కుడయ్యాడు (joyful). ప్రముదితుడయ్యాడు (over joyed). ప్రీతిసౌమనస్యజాతుడయ్యాడు" (jubilant). "ఆశ్చర్యం పరమాశ్చర్యం" అనుకొని "పారిపోతున్న అతణ్ణి పట్టుకోండి" అని తన మనుషులను ఆజ్ఞాపించాడు. వాళ్లు ఆ దరిద్ర పురుషుణ్ణి వెంబడించి పట్టుకొన్నారు. దరిద్ర పురుషుడు భీతుడయ్యాడు. త్రస్తుడయ్యాడు. సంవిగ్నుడయ్యాడు. ఉద్విగ్నమానసుడయ్యాడు. బిగ్గరగా ఏడుస్తూ "దొరలారా, మీ కాళ్లు పట్టుకొంటాను. నన్ను వదలండి. నేను ఏ తప్పూ చేయలేదు. దేవుడి మీద ఒట్టు" అని దీనదీనంగా మొరపెట్టుకొన్నాడు. వాళ్లు అతని మాటలను పట్టించుకోలేదు. కుయ్యో మొర్రో అని

ఏడుస్తున్న అతణ్ణి బరబరా లాక్కెళ్లారు. తనకు పడబోయే దండన గురించి లేనిపోనివి ఊహించుకొని దర్రిద్రపురుషుడు మూర్ఛ చెందాడు.

వృద్ధగృహపతి ఉపాయకౌశల్యం (skill in means) కలిగినవాడు. "ఆ దర్రిద్ర పురుషుణ్ణి ప్రేమగా దగ్గరకు చేర్చి 'నాయనా, నీవు దర్రిద్ర పురుషుడవు కావు. ఈ అపార సంపదకు ఏకైక వారసుడవు' అంటే ఆ దర్రిద్ర పురుషుడు నమ్మడు. మరింతగా బెదిరిపోయి పందు చిక్కితే ఏ దర్రిద్ర వీధికో పారిపోయి దాక్కుంటాడు. కనుక అతణ్ణి మెల్లమెల్లగా దారిలోకి తీసుకరావాలి" అనుకొని కార్యనిర్వహణాధికారితో (manager) "ఆ పరదేశీయ దర్రిద్రుడు మూర్ఛనుండి లేచాక 'బంధవిముక్తుడవు (free man) నీవు. ఇక నీ ఇష్టం వచ్చిన దిక్కుకు వెళ్లవచ్చు' అని చెప్పి మొదట అతని భయాన్ని పోగొట్టుము. పని దొరక్క అల్లాడే వ్యక్తిలా కనిపిస్తున్నాడు. పారిశుద్ధ్యం పని ఇచ్చి ఉండటానికి ఒక కుటీరం అతనికి కేటాయించు" అన్నాడు.

దర్రిద్ర పురుషుడు పరమానందంగా అక్కడ పారిశుద్ధ్యం పనిలో చేరాడు. కొన్నాళ్లు గడిచింది. గృహపతి ప్రతిదినమూ మేడ మీది గదినుండి ఆ దర్రిద్ర పురుషుణ్ణి గమనిస్తూనే ఉన్నాడు. ఒకనాడు గృహపతి తన అమూల్య వస్త్రాభరణాలను తీసివేసి మారువేషం ధరించాడు. ఆ దర్రిద్ర పురుషుడు ఏ అవతారంగా కనిపిస్తున్నాడో అదే విధమైన వేషం వేసుకొన్నాడు. ఒక చేత చీపురుకట్ట మరో చేత ఒక చిన్న గంప పట్టుకొని తనూ అచ్చం ఒక పనివానిలా కనిపిస్తూ ఆ దర్రిద్ర పురుషుడు పని చేసే చోటుకు వెళ్లి "ఎవరు నాయనా నీవు? ఇక్కడ కొత్తగా పనిలో చేరావా? నిన్ను చూస్తుంటే చచ్చి స్వర్గంలో ఉన్న నా కుమారుణ్ణి చూసినట్లే ఉంది. 'పుత్రా' అని నిన్ను నోరార పిలుస్తాను. నీవు 'నాన్నా' అని బదులు పలికితే అదే నాకు చాలు." ఇలా పరిచయం ప్రారంభించి ప్రతిదినమూ అతనికి కనిపిస్తూ ఆప్యాయంగా పలకరిస్తూ వచ్చాడు. ఇలా కొన్నాళ్లు గడిచాక దర్రిద్ర పురుషుడు ఆ వృద్ధ కార్మికునిపట్ల తండ్రి అనే భావన కలిగించుకొన్నాడు.

* * * * *

ఒకనాడు గృహపతికి తన మరణ గడియలు సమీపిస్తున్నాయనిపించి అధికారులను, పురప్రముఖులను, పురోహితులను, భృత్యులను తన శయనం వద్దకు రప్పించి పాతికేండ్ల నాటి తన గత జీవితం వివరాలు చెప్పి నష్టపుత్రకుడు మళ్లీ ఎలా కనిపించాడో కూడా చెప్పి ఆస్తికంతటికీ అతణ్ణే వారసుడుగా ప్రకటించాడు.

దరిద్ర పురుషుడికి భవనం నుండి పిలుపు వచ్చింది. "ఈ వేళ నాన్నగారు కనిపించడం లేదు. నాకు చెప్పకుండా ఎక్కడికెళ్లారు?" అని బెంగతో ఉన్నట్టి ఆ దరిద్ర పురుషుడు అన్యమనస్కంగానే భవనంలోకి వెళ్లాడు. అధికారులు, పురప్రముఖులు, పురోహితులు, భృత్యులచే పరివేష్టితుడై శయ్య మీద ఒక వైపుగా తిరిగి పడుకొనియున్న వ్యక్తిని చూశాడు. అతనికి నమ్మశక్యం కావడం లేదు. పరమాశ్చర్యం చెందాడు. 'పుత్రా పుత్రా' అని ఇన్నాళ్లు ఆప్యాయంగా పలకరిస్తూ వాత్సల్యాన్ని కుండపోతగా తన మీద కుమ్మరిస్తూ వచ్చిన తోటి పనిమనిషి ఆ శయ్య మీద అలా కనిపించడం ఆశ్చర్యం కాక మరేమిటి? 'నేనొక దరిద్ర పురుషుడను' అని ఇన్నాళ్లుగా భావిస్తూ వచ్చిన అతడు ఆ క్షణంలోనే ఆ హీనభావాన్ని త్యజించాడు. 'నేనొక మహాధనికుడను' అనుకొన్నాడు.

ఇక్కడికి ఉపమ (parable) అయిపోయింది. ఆ గృహపతిలాగానే బుద్ధుడు కూడా వినేయజనుల్లోని న్యూనతా భావాన్ని, దైన్యభావాన్ని తొలగిస్తాడు. బుద్ధుని బోధనలు కొంచెం అర్థమైనా చాలు మనిషిలో అధ్యాత్మిక అభిజాత్యం (spritual aristocracy) కలుగుతుంది. దైన్యం పటాపంచలవుతుంది.

* * * * *

పాఠకులను మొదట సూత్రం పట్ల ఆకర్షితులను చేయడం కోసం ఉపోద్ఘాతాన్ని ఇంకొంచెం పొడిగిస్తున్నాను. సమకాలీన బౌద్ధరచయితలలో భిక్షు సంఘరక్షితగారు ప్రసిద్ధులు. ఈయన బ్రిటిష్ దేశీయుడు. 1942లో 17వ ఏట మిలిటరీ ఉద్యోగంలో చేరాడు. భారతదేశానికి నౌకలో ప్రయాణిస్తూ భారతీయ సంస్కృతికి సంబంధించిన పుస్తకాలు చదువుతూ ఆ వరుసలోనే డైమండ్ సూత్రను కూడా చదవడం మొదలుపెట్టాడు. పుస్తకం చదివి ఏమి అర్థం చేసుకొన్నాడో మనకు తెలియదుగానీ జీవితం పూర్తిగా

మారిపోయింది. ఆ తరువాత బౌద్ధభిక్షువు అయ్యాడు. బౌద్ధపండితుడయ్యాడు. బౌద్ధరచయిత (సుమారు 40 పుస్తకాలు) అయ్యాడు. బౌద్ధప్రచారకుడయ్యాడు.

వజ్రచ్ఛేదికను ప్రస్తావించేటప్పుడు అవశ్యం ఆరవ గురువు (6th patriarch) ప్రస్తావన చేయడం పరిపాటి అయింది కనుక ఆయన ఆత్మకథను చెప్పి ఉపోద్ఘాతాన్ని ముగిస్తాను.

దక్షిణాది జెన్ (ధ్యాన)సంప్రదాయానికి చైనాలో హుయ్-నెంగ్ ఆరవ గురువు. సంప్రదాయాన్ని బుద్ధుని నుండి లెక్కిస్తే హుయ్-నెంగ్ 33వ గురువు అవుతాడు. ఈ సంప్రదాయాన్ని చైనాలో ప్రవేశపెట్టిన బోధిధర్ముడు జెన్‌కు చైనాలో మొదటి గురువయ్యాడు. అసలు మూల గురువు బుద్ధుడు. ఒకనాటి భిక్షు సమావేశంలో బుద్ధుడు ఏమీ మాట్లాడకుండా ఒక పుష్పాన్ని చేతిలోకి తీసుకొని దాన్ని తదేకంగా చూస్తూ ఉండినాడట! అక్కడ సమావేశమైన భిక్షువులలో మహాకాశ్యపుడు ఒక్కడు మాత్రమే ఆ సంకేతం యొక్క పరమార్థాన్ని గ్రహించి మందహాసం చేస్తూ తక్షణమే ముక్తుడయ్యాడట! జెన్ సంప్రదాయం ఇలా మొదట బుద్ధుని హృదయం నుండి మహాకాశ్యపుని హృదయానికి ఆ తరువాత మహాకాశ్యపుని నుండి ఆనందునికి ఇలా సంక్రమిస్తూ (heart to heart transmission) ఆ పరంపరలో 28వ వాడైన బోధిధర్మునికి సంక్రమించింది. బోధిధర్ముడు హిమాలయాలు దాటి చైనాకు వెళ్లి అక్కడ ఈ సంప్రదాయానికి మొదటి గురువయ్యాడు. ఇక ఆరవ గురువుగారి ఆత్మకథ.

ఒకనాడు ఆరవ గురువుగారు కాంటన్ నగరంలోని పావ్‌లిన్ విహారానికి వేంచేశారు. అప్పుడు ఆ నగరపాలకుడు ఇంకా ఇతర ఉన్నతాధికారులు గురువుగారిని సందర్శించి ఆ నగరంలోని ట-ఫన్ దేవాలయం హాలులో బౌద్ధం గురించి ప్రసంగాలు చేయవలసినదిగా మనవి చేశారు. గురువుగారు అంగీకరించారు.

ప్రసంగం వినడం కోసం నగరపాలకుడు, అధికారులు, కన్‌ఫ్యూషియన్ విద్వాంసులు, టావోయిస్టులు, భిక్షువులు, భిక్షుణిలు ఇంకా ఇతర ప్రముఖ పురజనులు మొత్తం ఓ వేయి మంది హాలులో గుమికూడారు. గురువుగారు వచ్చి ఆసనం మీద

కూర్చోగానే అందరూ ఒక్కసారిగా లేచి నమస్కరించి బౌద్ధధర్మాలను చెప్పవలసినదిగా మనవి చేశారు. గురువుగారు అక్కడ చేసిన ప్రసంగ పరంపరలో ఇది మొదటిది.

విద్వజ్జనులారా, బోధిబీజం (seed of enlightenment) మన మనస్సులోనే ఉంది. మనస్సు ద్వారానే మనం బుద్ధత్వం పొందవలసియున్నది. కనుక మొత్తం ధార్మిక జీవితం మనస్సును చక్కజేసుకోవడం తప్పించి అన్యమేమీ కాదు. నిగూఢమైన (esoteric) మన జెన్ సంప్రదాయానికి నేను ఎలా వారసుడనయ్యానో ఇప్పుడు చెబుతాను.

మానాన్న ఫన్–యాంగ్ ప్రాంతీయుడు. అక్కడ ఒక అధికారిగా ఉండేవాడు. ఏదో కారణం వల్ల ప్రభుత్వం అతని అధికారాన్ని ఊడబెరికి ఆ ప్రాంతం నుండి బహిష్కరించింది. ఆయన కువాంగ్‌టుంగ్‌కు వలసపోయి అక్కడ మామూలు పౌరుడుగా జీవిస్తూ ఉండగా దురదృష్టవశాత్ నా చిన్న వయస్సులోనే ఆయన అకాల మరణం చెందారు. ఆ దుర్ఘటన తరువాత నా తల్లికి అక్కడ జీవనం కష్టమయి నన్ను తీసుకొని కువాంగ్‌చౌ చేరింది. కుటుంబ పోషణ కోసం నేను చాలా చిన్న వయస్సులోనే చదువుసాములకు బదులు ఏదో ఒకటి చేయవలసి వచ్చింది. కట్టెలు కొట్టి అమ్మే పని చేపట్టాను.

ఒకనాడు బజారువీధిలో ఒక కొట్టులో కట్టెలమోపు దింపి చిల్లర తీసుకొని వెనుదిరిగి వస్తుండగా ఆ వీధిలో ఒక తిన్నె మీద కూర్చొని ఒకడు పుస్తకాన్ని చదువుతూ ఉండడం వినిపించింది. కాసేపు అలానే నిలుచుని విన్నాను. "ఇంద్రియ విషయాలైన రూప శబ్ద రస గంధ స్పృష్టవ్యాలలో మనోవిషయములైన ధర్మాలలో (mind–objects) చిత్తాన్ని తగుల్కోనీయరాదు" అనే వాక్యం వినగానే ఆ క్షణంలోనే నా చిత్తం విముక్తమయిపోయింది. "ఆ పుస్తకం పేరేమిటి?" అని అతణ్ణే అడిగాను. "వజ్రచ్ఛేదిక ప్రజ్ఞాపారమిత సూత్రం" అన్నాడతడు. "నీవు ఏ ఊరివాడవు? ఇక్కడ కూర్చొని దీన్నెందుకు చదువుచున్నావు?" అని అడిగాను. "హుయాంగ్‌మి జిల్లాలో ఉన్న టుంగ్–షన్ విహారంలో కొన్నాళ్లుండి వచ్చాను. అక్కడ ఐదవ గురువు హుంగ్–జెన్ ఉంటున్నారు. ఆయనకు అక్కడ వేయి మంది శిష్యులున్నారు. గృహస్థులను భిక్షువులను అందరినీ వజ్రచ్ఛేదికను

పఠిస్తూ ఉండమని ప్రసంగాల్లో చెబుతుంటారు. ఆ పఠనం వల్ల ప్రకృతి ప్రభాస్వరచిత్తం (perfectly pure and translucent in it's own nature) అనుభవానికి వస్తుంది అని కూడా చెబుతుంటారు" అన్నాడు ఆ ఆగంతకుడు.

ఆనాడు ఆ వీధిలో ఆ విధంగా వజ్రచ్ఛేదిక సూత్రం వినడం అనే మహాభాగ్యం నా పూర్వజన్మల సుకృత ఫలమే. టుంగ్–షన్ విహారానికి వెళ్లమని నా హృదయం తొందర పెట్టింది. కానీ నా తల్లిని నిస్సహాయురాలిగా వదలి వెళ్లడం తగదని భావించి ఆగాను. ఆమె పోషణకు తగిన ఏర్పాటు చేసిగానీ పోరాదని నిశ్చయించాను. మరొక అద్భుతం వెంటనే జరిగింది. ఒకనాడు బజారులో ఒక అపరిచిత వ్యక్తి నన్ను ఆపి "అబ్బాయ్, నీవు ఐదవ గురువు వద్దకు వెంటనే వెళ్లాలి. నీ తల్లి పోషణ ఏర్పాట్లకు దీనిని ఉపయోగించు" అని నా చేతిలో నాణాల సంచిని ఉంచి వెళ్లిపోయాడు.

ఒక నెల ప్రయాణం తరువాత టుంగ్–షన్ విహారం చేరి గురువుగారిని దర్శించి నమస్కరించాను. "నీవు ఎక్కడ్నుంచి వచ్చావు? ఏమి ఆశించి వచ్చావు?" అని ఆయన ప్రశ్నించారు. "నేను క్యాంగ్‌టుంగ్ ప్రాంతీయుడను. సాధారణ పౌరుడను. మీ దర్శనం కోసం అంత దూరం నుండి వచ్చాను. బుద్ధత్వం తప్పించి నేనింకేమీ ఆశించడం లేదు" అన్నాను. "క్యాంగ్‌టుంగ్ వాడవు నీవు. ఒక మ్లేచ్ఛుడవు (barbarian) కదా! బుద్ధత్వాన్ని ఎలా ఆశించగలవు?" అన్నారు గురువుగారు. "ఉత్తరాది వాళ్లున్నారు, దక్షిణాది వాళ్లున్నారు. కానీ ఈ ఉత్తరం దక్షిణం తేడాలు బుద్ధత్వానికి లేదు కదా!" అన్నాను నేను. ఆయన ఏదో చెప్పాలనుకొన్నారు కానీ అక్కడ శిష్యులు చాలా మంది ఉండడం వల్ల ఆపివేసి "పనిలోకి దిగు" అన్నారు. "గురువుగారికి ఒక విషయం మనవి చేస్తాను. విజ్ఞప్తిమాత్రతాసిద్ధి (pure awareness) నుండి చలించనివాడు పుణ్యక్షేత్రం అవుతాడు కదా! ఈ పుణ్యక్షేత్రానికి మీరు ఏ పని అప్పగిస్తారో నాకు తెలియదు" అన్నాను. "ఈ మ్లేచ్ఛుడు అతి తేజస్వి" అని మెల్లగా పలికి ఆపైన గట్టిగా "నోరు మూసుకొని దొడ్లోకి వెళ్లి కట్టెలు కొట్టే పనో వడ్లు దంచే పనో ఏదో ఒకటి చెప్పింది చేయి" అని కసిరారు.

ఎనిమిది నెలలు గడిచింది. కట్టెలు చీల్చే పని, వడ్లు దంచే పని చేస్తూ ఉండిపోయాను. ఒకనాడు గురువుగారు ఏకాంతంగా నావద్దకు వచ్చి "మ్లేచ్ఛుడా, బౌద్ధంలో నీకు మంచి జ్ఞానం ఉందని నాకు తెలుసు. కానీ నీతో మాట్లాడను. ఎందుకో తెలుసా? ఇక్కడున్న పాపకర్ముల వల్ల నీకు అపాయం కలుగరాదని" అన్నారు. "ఆ విషయం నాకూ తెలుసు. కనుకనే మీ నివాసం దరిదాపులకు కూడా నేను రావడం లేదు" అన్నాను.

గురువుగారు ఒకనాడు శిష్యులనందరినీ సమావేశపరచి "దుఃఖ సముద్రం నుండి బైటపడే మార్గం చూసుకోవాలి. ఏవో పుణ్యకార్యాలు, కర్మకాండలు చేయడం చాలదు. చిత్తాన్ని నిరావరణంగా (unobstructed, unobscured) చేసుకోవాలి. ఇక మీమీ కుటీరాలకు వెళ్లి మీ మనస్సులో ఉన్న ప్రజ్ఞను వెలికి తీయండి. ఆపైన దాని మీద ఒక గాథను (stanza) వ్రాసి నాకు చూపండి. ప్రజ్ఞ (insight) మీద ఎవడు చక్కని గాథను వ్రాస్తాడో అతనికి గురు చీవరాన్ని (robe, the insignia of the partriarchte) మరియూ ధర్మరహస్యాలను (esoteric teachings of Dhyana school) అప్పగించి ఆరవ గురువుగా నియమిస్తాను. గాథను వ్రాయడానికి దీర్ఘకాల మీమాంస (deliberation) అవసరం లేదు. స్వీయ చిత్తగ్రంథాన్ని చక్కగా చదివినవాడు, అర్థం చేసుకొన్నవాడు గాథను క్షణంలో చెప్పగలడు. ఇక వెళ్లండి" అన్నారు.

శిష్యులు తమతమ నివాసాలకు వెళ్తూ ఒకరితో ఒకరు "గాథను వ్రాసి చూపడం వృథా శ్రమ. గురుపీఠాన్ని ఎక్కబోయేది మన అధ్యాపకుడు షెన్-ష్యూగారే. ఆయన గాథ ముందు నిలువగల గాథను వ్రాసే మొనగాడెవడున్నాడు ఇక్కడ?" అని చెప్పుకొంటూ షెన్-ష్యూగారిని ప్రశంసిస్తూ వారి వారి కుటీరాలు చేరి పడకలు వేసుకొని పడుకొని హాయిగా నిదురించారు.

అధ్యాపకుడు షెన్-ష్యూ పరిస్థితి భిన్నంగా ఉంది. "ఈ గాథా పోటీలో నేనున్నానని నా విద్యార్థులెవరూ ఇందులో పాల్గొనరు. గాథ వ్రాసి గురువుగారికి చూపాలా? వద్దా? చూపకపోతే గురువుగారికి ఎలా తెలుస్తుంది-నా జ్ఞానం గంభీరమా మిడిమిడియా అనే

విషయం? కానీ ముందుగా నేను నా మనస్సులో ఏముందో చూసుకోవాలి. ధర్మ రహస్యాలు తెలుసుకోవాలనే సదాశయం ఒకటే ఉంటే గాథ వ్రాసి చూపడం మంచిదే. గురుపీఠం మీద మక్కువ మనస్సులో దాగియుంటే మాత్రం గాథ వ్రాసి చూపడం మంచిది కాదు. నన్ను నేను పృథక్‌జన (worldling) స్థాయికి దించుకోవడం అవుతుంది. మరి గాథ వ్రాసి చూపకపోతే ధర్మరహస్యాలు తెలుసుకొనే అవకాశం కోల్పోతాను. ఇది నిజంగా చిక్కు సమస్యే. ఎలా చేయడం? వ్రాస్తావా? వద్దా? " అని డోలాయమానసుడయ్యాడు.

గురువుగారి సభామందిరానికి మూడు ప్రవేశ ద్వారాలున్నాయి. ఆ ప్రవేశ ద్వారాల గోడల మీద త్వరలోనే లు-చెన్ అనే ప్రసిద్ధ ఆస్థాన కళాకారుడు లంకావతార సూత్రానికి సంబంధించిన వర్ణచిత్రాలను మరియూ ఐదుగురు గురువుల చిత్రాలను చిత్రించబోతున్నాడు.

షెన్-ష్యూగారు ఎట్టకేలకు గాథను వ్రాసి చూపడమే మంచిదనే నిశ్చయానికి వచ్చి వెంటనే ఒక గాథను వ్రాసి గురువుగారి సభా మందిరానికి వెళ్లాడు. కానీ లోనికి ప్రవేశించి ఆ గాథను గురువుకు చూపించే సాహసం చేయలేకపోతున్నాడు. ఆ తరువాత వరుసగా నాలుగు రోజుల్లో మొత్తం పదమూడు సార్లు ద్వారం వద్దకు రావడం ఆగిపోవడం వెనుదిరగడం చేశాడు. ఇక లాభం లేదనుకొని వేరే విధానం ఆలోచించాడు. "ఈ ప్రవేశద్వారం గోడ మీద గాథను వ్రాసేస్తే అది తప్పక గురువుగారి దృష్టిలో పడుతుంది. ఆయన ఆ గాథను చూసి ఆమోదిస్తే "గాథను వ్రాసింది నేనే" అని ప్రకటిస్తాను. ఒకవేళ అది గురువుగారి ఆమోదానికి నోచుకోకపోతే నేను చేసేది ఏమీ లేదు. ధర్మరహస్యాలు వినే యోగ్యత నాకు లేదు అని సరిపెట్టుకొంటాను. "

ఆ రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకు షెన్-ష్యూగారు ఒక దీపాన్ని తీసుకొని రహస్యంగా సభామందిరం దక్షిణ ద్వారం వద్దకు వెళ్లి గోడ మీద క్రింది గాథను వ్రాసి వచ్చేశారు.

*ఈ శరీరమే ఒక బోధివృక్షము*

*ఈ మనస్సే ఒక మెరిసే అద్దము*

*మసకబారనీయరాదు దీనినెప్పుడూ*

*తుడవాలి వాలే దుమ్మును గంటగంటకూ*

షెన్-హ్యూగారికి ఆ రాత్రి నిదుర పట్టలేదు. "గురువుగారు గాథను చూసి ఎలా స్పందిస్తారో " అనే ఉత్కంఠతో జాగరం చేశారు.

మరుసటి దినం ప్రొద్దున గురువుగారు ఆస్థాన కళాకారుణ్ణి వెంటబెట్టుకొని దక్షిణ ద్వారం గోడవద్దకు రాగానే ఆ గాథ కనిపించింది. చదివాక కళాకారునితో "ప్రస్తుతానికి ఈ గోడల మీద చిత్రీకరణం వద్దనుకొంటున్నాను. 'సర్వసంస్కారాశ్చ మృషా మోషధర్మాణః' (all products are false and deceptive = అంతా మోసమే) అని భగవానుడు చెప్పియున్నాడు కదా! మన బొమ్మల కోసం ఈ గాథను తుడిచి వేయడం నాకు నచ్చదు. ఇక్కడికి వచ్చే వాళ్లందరూ ఈ గాథను చదివి మననం చేసుకోవాలి. ఆచరణలో పెట్టి దుర్గతి నుంచి తప్పించుకోవాలి. పుణ్యసంపదను ఆర్జించాలి" అన్నారు.

ఆ తరువాత గురువుగారు శిష్యులనందరినీ అక్కడకి పిలిపించి ఆ గాథకు ధూపదీపారాధన చేసి శిష్యులను ఏకకంఠంతో ఆ గాథను పఠించమన్నారు. శిష్యులందరూ ఆ గాథను పఠించి "సాధు సాధు" (well spoken, well spoken) అని మెచ్చుకొన్నారు.

ఆ దినం అర్ధరాత్రి గురువుగారు షెన్-హ్యూగారిని తన నివాసానికి పిలిపించి "ఆ గాథను వ్రాసింది నీవే కదూ! బోధిమందిర ద్వారం దరిదాపులకు వచ్చావు కానీ ఇంకా లోనికి ప్రవేశించలేదు. ఇంకా కొన్నాళ్లు బాగా ధ్యానం చేసి ఆపైన మరో గాథను వ్రాసి నాకు చూపించు. విమోక్షముఖంలో (door of liberation) నీవు ప్రవేశించినవాడుగా నాకనిపిస్తే ఈ గురుపీఠ చీవరాన్ని (robe), ధర్మరహస్యాలను నీకు సంక్రమింపజేస్తాను" అన్నారు.

రెండు రోజుల తరువాత ఒక శ్రామణేరుడు (novice) ఆ గాథను బిగ్గరగా పఠిస్తూ నేను పని చేస్తున్న చోటికి రావడం చూశాను. ఆ గాథను వినగానే నాకర్థమయి పోయింది–ఆ గాథను రచించిన వ్యక్తికి చిత్తధర్మతా (real nature of mind) తెలిసి రాలేదనే విషయం. "ఎవరి గాథ ఇది? " అని అతణ్ణి అడిగాను. "మ్లేచ్ఛుడా (you barbarian), వడ్లు దంచడం, ముద్దలు మింగడం, నిదురించడం తప్ప ఇతర సంగతులు నీవెందుకు పట్టించుకొంటావు? నీలోకం నీదిగా ఉన్నావు. షెన్–ష్యూగారి అమోఘమైన గాథా రత్నమిది. రేపోమాపో ఆయన ఆరవ గురువు కాబోతున్నారు" అన్నాడు ఆ శ్రామణేరుడు. "సోదరా, ఆ గాథ ఏ గోడ మీద వ్రాసి ఉన్నదో నాకు తెలియదు. సభామందిరం ఏది ఎక్కడుందో కూడా తెలియదు. నీవు నన్ను అక్కడికి తీసుకెళ్లు. ఆ గాథను నేను కూడా ధూపదీపాలతో పూజించాలనుకొంటున్నాను" అన్నాను.

ఆ పిల్లవాడు నన్ను అక్కడికి తీసుకెళ్లి గాథను చూపించాడు. నాకు చదువు రాదు. చియాంగ్–చౌ జిల్లా నుండి వచ్చిన ఒక క్రింది స్థాయి అధికారి అక్కడ కనిపిస్తే దాన్ని చదివి వినిపించమని కోరాను. అతడు చదివి వినిపించాడు. "నేనొక గాథను చెబుతాను. ప్రక్కనే వ్రాయి" అని అతణ్ణి కోరాను. "వింతల్లో వింత! నీవూ గాథను వ్రాసేవాడివా?" అన్నాడు అతడు చాలా అపనమ్మకంతో. "బోధిని కాంక్షించేవాడివి నీవయిన పక్షంలో మొదట నీవు చేయవలసిన పని నిమ్నవర్గీయుల పట్ల చిన్న చూపు వదిలించుకోవడం. నిమ్నులు ఉన్నతులు అనే తూకం బుద్ధి వల్ల చాలా పాపాన్ని మూటగట్టుకుంటావు" అన్నాను. నా చూపుల తీక్షణతకు, మాటల వేడిమికి అతడు అదిరిపోయి "నీ గాథను పఠించు. వ్రాస్తాను. కానీ ఒక నిబంధన. నీవు గురుపీఠం అధిరోహించి ధర్మరహస్యాలు తెలుసుకొంటే వాటిని నాకూ చెప్పాలి" అని వ్రాసేందుకు సిద్ధమయ్యాడు. నేను ఈ గాథను పఠించాను.

*బోధివృక్షమూ లేదు*
*మెరిసే అద్దము లేదు*
*అంతా శూన్యతయే*
*దుమ్ము వాలే చోటేదీ?*

ఆ గాథ ఒక కలకలాన్ని అక్కడ కలిగించింది. అయ్యారే, బాపురే లాంటి ఆశ్చర్యద్యోతక పదాల చప్పుడు విని గురువుగారు అక్కడికి వచ్చి ఆ కలకలానికి కారణం తెలుసుకొని కాలినుండి చెప్పును ఊడదీసి నిరసన భంగిమను ముఖం మీద తీవ్రంగా ప్రదర్శిస్తూ ఆ చెప్పుతో గాథను చెరిపివేసి "వెర్రిమొర్రి గాథ" అని తిడుతూ వెళ్లిపోయారు.

మరుసటి దినం గురువుగారు ఎవ్వరికంటా పడకుండా నేను పని చేస్తున్న చోటికి తటాలున వచ్చి "ముముక్షువుగా ఉన్నవాడు ధర్మం కోసం ప్రాణాపాయాన్ని కూడా లెక్క చేయరాదు కదా! నీవేమనుకొంటున్నావు? బియ్యం సిద్ధమేనా?" అని ప్రశ్నించారు. "చాలా నాళ్ల క్రితమే సిద్ధమయ్యింది. జల్లెడ కోసం ఎదురు చూస్తున్నది" అన్నాను. గురువుగారు మళ్లీ ఏమీ మాట్లాడకుండా నాచేతిలో ఉన్న రోకలి మీద తన బెత్తంతో మూడు సార్లు కొట్టి వెళ్లిపోయారు.

ఆ సంకేతానికి అర్థం ఏమిటో నాకు తెలిసింది కనుక ఆ రాత్రి మూడవ జామున రహస్యంగా ఆయన గదికి వెళ్లాను. నేను వెళ్లిన సమయంలో ఆయన తలుపులు లేని తన గది కిటికీలకు అడ్డంగా గుడ్డలను వ్రేలాడదీస్తున్నారు. ఆపైన నన్ను ఒక ఆసనం మీద కూర్చోమని చెప్పి మెల్లగా వజ్రచ్ఛేదిక ప్రజ్ఞాపారమిత సూత్రాన్ని నాకు బోధించడం మొదలు పెట్టారు. "*న రూప ప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం. న శబ్ద రస గంధ స్ప్రష్టవ్య ధర్మ ప్రతిష్ఠితం చిత్తముత్పాదయితవ్యం*" వాక్యం వద్ద నాకు ఆశ్రయ పరావృత్తి (revolution at the basis) కలిగిపోయింది.

"చిత్తధర్మతను (essence of the mind = తథతా) తెలుసుకొన్నవానిగా నిన్ను నేను గుర్తిస్తున్నాను. బోధిధర్ముని వారసత్వాన్ని నీకు సంక్రమింప జేస్తున్నాను. ఇప్పుడు

నీవు ఈ సంప్రదాయంలో ఆరవ గురువు అయ్యావు" అని యుగపత్ విముక్తి శాఖ (sudden enlightenment school) ధ్యాన రహస్యాలను నాకు బోధించి గురుపీఠానికి చెందిన చీవరాన్ని, భిక్షాపాత్రను నాకు అప్పగించి మళ్లీ ఇలా అన్నారు. "ఇక నిన్ను నీవు కాపాడుకొంటూ సాధ్యమైన మేరకు సోదర సత్త్వులను (sentient beings) విముక్తి పథానికి మళ్లించు. నీకు సంక్రమించిన ధర్మాన్ని వ్యాపింపజేయి. మొదటి గురువు బోధిధర్ముడు ఈ దేశానికి వచ్చినపుడు ఆయనను ఎవరూ నమ్మలేదు. ఎన్నో ఏండ్లు పట్టుదలగా కృషి చేసి ఆయన ఇక్కడ ధర్మాన్ని వ్యాపింపజేశారు. ఆయన నుండి సంక్రమించిన చీవరం, భిక్షాపాత్రలను నీ అనంతరం ఎవరికీ సంక్రమింపజేయకు. వెంటనే నీవు ఇక్కడ్నుంచి వెళ్లిపోవాలి. ప్రాణాపాయం పొంచి ఉంది" అన్నారు.

"ఎక్కడికి వెళ్లాలి?" అని అడిగాను. "హుయ్‌కి వెళ్లి అక్కడ కొంతకాలం అజ్ఞాతంగా ఉండు. నీకు ఈ ప్రదేశం కొండదారులు తెలియదు కనుక రేవు వరకు తోడుగా వస్తాను" అన్నారు గురువుగారు.

రేవుకు చేరి పడవలో కూర్చున్నాక తెడ్డు వేసే పని ఆయనే తీసుకొన్నారు. "ఆ పని మీరు చేయడం సబబు కాదు. నేను చేస్తాను" అన్నాను. నిన్ను నదిని (సంసార నదిని) దాటించడం నా కర్తవ్యం" అన్నారు ఆయన. "నేను సంసార బద్ధుడను కాను గదా" అన్నాను. "నీవన్నది సరియైన మాటే" అని ఆయన తెడ్డును నా చేతికిచ్చి "ధ్యానమార్గం నీవల్ల లోకంలో వ్యాప్తి చెందుతుంది. ఇక సరిగ్గా మూడేండ్ల తరువాత నా ఆయుష్షు తీరిపోయి ఈ దేహం అంతరించిపోతుంది. ఇకనుండి నీదే బాధ్యత. దక్షిణంగా వెళ్లగలిగినంత దూరం వెళ్లు. తొందర వద్దు. బౌద్ధప్రచారం తేలిక వ్యవహారం కాదు" అన్నారు. ఆవలితీరంలో నన్ను దింపి వీడ్కోలు చెప్పి ఆయన పడవలో వెనుదిరిగాక నేను దక్షిణంగా రెండు నెలలు ప్రయాణించి టా–యు కొండను చేరాను.

ఆ కొండను చేరాక కొన్ని వందల మంది నన్ను వెంబడించి వస్తూ ఉండడం గమనించాను. చీవరాన్ని, భిక్షాపాత్రను నానుండి లాక్కోవడానికి వస్తున్నారని గ్రహించి పరుగెత్తడం మొదలుపెట్టాను. కానీ హ్యూ–మింగ్ అనే భిక్షువు నన్ను పట్టుకొనేంత

సమీపానికి వచ్చేశాడు. అతడు పూర్వాశ్రమంలో సైన్యంలో నాలుగవ స్థాయి నాయకుడుగా పని చేసినవాడు. నేను చీవరాన్ని, భిక్షాపాత్రను ఒక బండ మీదికి విసిరివేసి అతని దృష్టిని వాటి మీదికి మళ్లించి ఒక పొదలో దాక్కున్నాను.

హ్యూ-మింగ్ పరమానందంతో వాటిని తీసుకోదలచాడు. అతని చేతికి అవి రాలేదు. వెంటనే అతనిలో పరివర్తనం కలిగి "సోదరా, సోదరా, నీవెక్కడున్నావు? ఈ చీవరం భిక్షాపాత్రల కోసం నేను రాలేదు. ధర్మరహస్యాల కోసమే వచ్చాను. సోదరా, సోదరా, ధర్మమేఘాన్ని నా మీద వర్షింపజేసి నా తాపాన్ని చల్లార్చు" అని ప్రాధేయపడినాడు. నేను పొదనుండి బయటకు వచ్చి అతనికి ధర్మాన్ని బోధించి మెంగ్ ప్రాంతానికి వెళ్లి అక్కడ ధర్మసేవకు అంకితం కమ్మని చెప్పి పంపివేశాను.

ఆ తరువాత నేను జు-హూయ్ అడవిలో ఒక వేటగాళ్ల గుంపులో చేరిపోయి పదిహేనేండ్లు అజ్ఞాతవాసం చేశాను. నన్ను వాళ్లు ఒక వెట్టిబాగులవాడుగా భావించినందువల్ల నాకు ఇబ్బందులు కలుగలేదు. వలలు ఉచ్చుల వద్ద నన్ను కాపలా ఉంచితే వాటిలో పడి చిక్కుకున్న జీవాలను తప్పించివేసేవాడిని. వాళ్లు మాంసం వండుకొనే పాత్రలోనే నాకోసం కాయకసురులు వేసి ఉడకబెట్టుకొనేవాణ్ణి.

15 ఏండ్ల అజ్ఞాతవాసం తరువాత ఈ నగరానికి వచ్చి ఇదే దేవాలయం చేరాను. ఆ రోజుల్లో ఇక్కడ భిక్షు ఇన్-ట్స్యూంగ్ ధర్మభాణకుడుగా (preacher of Dharma) ఉండేవాడు. నేను ఇక్కడికి చేరిన సమయంలో ఆయన శ్రోతలకు మహాపరినిర్వాణ సూత్రాన్ని చెబుతున్నాడు. ఒక విషయంగా వాదోపవాదానికి దిగిన ఇద్దరు భిక్షువులు తటాలున లేచి నిలబడినారు. ఆ ఇద్దరిలో ఒకడు ధర్మభాణకునితో "భదంతా (venerable sir), మన దేవాలయం మీద బౌద్ధపతాకం గాలికి కదులుతూ ఉంటుంది కదా! 'పతాకం కదులుతూ ఉంది' అన్నాను నేను. ఇతడు అంగీకరించడం లేదు. 'పతాకం కదలడం లేదు. గాలియే కదులుతూ ఉన్నది' అని వాదిస్తున్నాడు..." అని ఇంకా ఏమో చెప్పబోతుంటే నేను అడ్డు తగిలి "పతాకమూ కదలడం లేదు, గాలీ కదలడం లేదు. కదులుతున్నవి మీ మనస్సులే" అన్నాను. సభ అదిరిపోయింది.

ధర్మభాణకుడు నన్ను వేదిక మీదికి ఆహ్వానించి ప్రక్కనే కూర్చోబెట్టుకొని మహాపరినిర్వాణ సూత్రంలో చిక్కుముడులు లాంటి కొన్ని జటిల అంశాల మీద ప్రశ్నలు వేశాడు. ఆ చిక్కుముడులను విప్పి వేస్తున్న విధంగా నేను సమాధానాలు చెప్పడంతో అతడు పరమాశ్చర్యంతో "సోదరా, గ్రంథాల్లో లభించని చక్కని సమాధానాలు నీ నోట వింటున్నాను. నీవు సామాన్య వ్యక్తివి కావు. ఐదవ గురువు నుండి చీవరం, భిక్షాపాత్ర, ధర్మరహస్యం స్వీకరించిన ఒక నిమ్నజాతీయుడు దక్షిణాదికి వచ్చాడని చాలా ఏండ్లుగా వింటున్నాను. సంశయం లేదు. ఆ వ్యక్తివి నీవే" అన్నాడు. అవునని తెలుపుతూ నేను తల ఊపాను. చీవరాన్ని, భిక్షాపాత్రను చూపమన్నాడు. చూపాను.

అప్పటి వరకు నేను ఉపాసకుడినే (lay disciple). ధర్మభాణకుడు నాకు ఉపసంపద (ordination) ఇచ్చి భిక్షువును చేసి ఆపైన నాకు నమస్కరించి శిష్యుడయ్యాడు.

ఆనాడు టుంగ్-షన్ విహారంలో బాలుడుగా ధర్మాన్ని గ్రహించినప్పటినుండి ఇప్పటికి చాలా ఏండ్లు గడిచాయి. బాలుడు వృద్ధుడయ్యాడు. బుద్ధభగవానుడు బోధించిన అనిత్యతా సత్యానికి ఇంతకన్నా వేరే నిదర్శనం ఎందుకు? నీటిబుడగవంటి ఈ జీవితం టప్‌మని పగిలిపోకుండా ఇప్పటిదాక నిలిచియుండడం కన్నా పెద్ద అద్భుతం ఇంకేమున్నది? సోదరులారా, మనం గతించిన జన్మల్లో ఎంతో పుణ్యం ఆర్జించినందువల్లనే ఇప్పుడు ఇక్కడ కూర్చొని ధర్మాన్ని గురించి మాట్లాడుకొనుచున్నాము. మనందరి చిత్తాల్లో దాగి ఉన్న బోధిని బయటకు ప్రకాశపరచడమే మన జీవితాలకు పరమ ప్రయోజనం. ఐదవ గురువు నుండి నాకు సంక్రమించిన ధర్మాన్ని రేపటి నుండి మీకు చెబుతాను.

*బుద్ధం శరణం గచ్ఛామి*

*ధర్మం శరణం గచ్ఛామి*

*సంఘం శరణం గచ్ఛామి.*

Note:- ఆరవ గురువు జీవిత చరిత్ర పూర్తిగా చెప్పాలంటే విడిగా పుస్తకమే వ్రాయవలసి ఉంటుంది. కానీ ఇప్పుడు చెప్పినంతవరకు చూస్తేనూ పూర్తి జీవిత చరిత్ర చెప్పినట్లే అనిపిస్తూ

ఉన్నది. ఆ షెన్-ష్యూగారు ఏమయ్యారు? అనే జిజ్ఞాస కొందరికి కలుగవచ్చు. గురుపీఠానికి వారసుడు కాలేకపోవడంతో షెన్-ష్యూగారు తీవ్రంగా కుమిలిపోయి ఉత్తరాదికి ప్రయాణం అయి చాలా ఏండ్లు ఏకాంతవాసం చేసి ఆపైన ఆయన కూడా జెన్ సంప్రదాయాన్ని తనదైన శైలిలో బోధించడం ప్రారంభించారు. ఈయన ప్రారంభించిన ఉత్తరాది జెన్ విధానానికి అనుపూర్వ విముక్తి శాఖ (gradual enlightenment school) అనే పేరు ఏర్పడింది. షెన్-ష్యూగారు, హుయ్-నెంగ్‌గారు ఎప్పుడూ ఒకర్నొకరు విమర్శించుకోలేదు. కానీ ఈ ఇరువురి అనుచర వర్గంలో కొందరు వీరాభిమాన దురభిమానులుగా మారారు. షెన్-ష్యూగారి వీరాభిమాని శిష్యుడొకడు హుయ్-నెంగ్‌గారిని హతమార్చదలచి దక్షిణాదికి ప్రయాణమయ్యాడు. ఆరవ గురువు దివ్యదృష్టికి ఇది తెలిసి తన గదిలో బల్ల మీద కొన్ని నాణాలు ఉంచి అతని రాక కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాడు. అతడు రాగానే "రా, బాబూ" అని సాదరంగా ఆహ్వానించి "ఈ దేశంలో కసాయి వాళ్లకు ఒక జీవాన్ని వేటు వేస్తే లభించే కూలి ఒక రూక. ఈ పని మీద నీవు ఇంత దూరం వచ్చావు కనుక దారిఖర్చుల కోసం అదనంగా పది రూకలు మొత్తం పదకొండు రూకలు ఆ బల్ల మీద ఉంచాను. నీ పని కానించి అవి తీసుకెళ్లు" అన్నారు. ఆ జిఘాంసువు (చంపనిచ్ఛగించినవాడు) కత్తిని పారవైచి శిష్యుడయ్యాడు.

* * * * *

సూత్రపాఠానికి పోయేముందుగానే పాఠకులకు ఒక గమనిక. ఈ సూత్రంలోనూ తక్కిన సూత్రాలకు మాదిరే పునరుక్తి (repetition) ఎక్కువగానే ఉంటుంది. పునరుక్తి అనేది సమాచార (information) గ్రంథాల్లో పొసగదు. చెప్పిందే మళ్లీ ఎందుకు చెప్పడం? సమాచారాన్ని ఒక సారి చెప్తే చాలు. వజ్రచ్ఛేదిక సమాచార గ్రంథం కాదు. చదివేటప్పుడు సేకరించి జ్ఞప్తిలో పెట్టుకోదగిన సమాచారం ఏమీ ఉండదు.

పఠన విషయంగా మరో గమనిక. మౌనపఠనం అనేది నేడు మనకు అబ్బిన అలవాటు. పాతరోజుల్లో పఠనం అంటే వినబడే విధంగా చదవడమే. సూత్రగ్రంథాన్ని (మూలాన్ని) మౌనంగా నవలలాగా పఠిస్తే విసుగు పుట్టవచ్చు. మూలాన్ని కనీసం తన చెవులకు వినబడే విధంగానైనా శబ్దఉచ్చారణ చేస్తూ చదవాలి. పాఠకుల స్వీయ పఠనం కోసమే అనుబంధంలో మూల సంస్కృత గ్రంథాన్ని తెలుగు లిపిలో చేర్చాను.

# 1. పర్షదం (Assembly)

*అవతారిక– జేతవనంలో ఒకనాటి భిక్షు సమావేశంలో జరిగిన సంభాషణ ఈ వజ్రచ్ఛేదిక. జేతవనం కోసలదేశ రాజకుమారుడు జేతునిది. ఆ వనం అంటే అతనికి పంచప్రాణాలు. అనాథపిండదుడు అనే మహాధనికుడు బుద్ధుని ఉపాసకుడుగా (lay disciple) మారాక భిక్షుసంఘానికి తగిన నివాసంగా జేతవనాన్ని ఎంపిక చేసి ఒక మధ్యవర్తిని వెంటబెట్టుకొని జేతుని నివాస భవనానికి వెళ్లి ఆ వనానికి ఖరీదు కట్టి తనకు ఇచ్చివేయమని కోరుతాడు. "ఆ వన భూభాగాన్ని మొత్తం బంగారు నాణాలతో కప్పితే ఎంత అవుతుందో అంత!" అన్నాడు జేతుడు. "క్షత్రియ కుమారులు మాట తప్పరు. ఈ క్షణం నుండి ఆ వనం నాది. బంగారు నాణాలు నీవి" అన్నాడు అనాథపిండదుడు. ఈ కథ వెనుక ఒక అర్థం ఇమిడి ఉన్నది. వెలకట్టలేని ఎన్నో దివ్య బోధనలకు వేదిక అయ్యింది కదా జేతవనం! శ్రావస్తీ నగరం లోనిది జేతవనం. కోసలదేశానికి ఆనాడు అది రాజధాని. అద్భుత నగరంగా ప్రసిద్ధి. నేడు మనకు జేతవనమూ కనిపించదు. శ్రావస్తీ నగరమూ కనిపించదు. ఉత్తరప్రదేశ్‌లోని గోండా జిల్లాలో రప్తినదీ తీరంలో సహేత్-మహేత్ అనే గ్రామం కనిపిస్తుంది.*

*సూత్రపిటకంలోని సూత్రాల వలెనే వజ్రచ్ఛేదిక సూత్రం కూడా "ఏవం మయా శ్రుతమ్"= నేను వినిన విధం బెట్టిదనిన అనే వాక్యంతో మొదలవుతుంది. ఈ వాక్యం ఆనందునిది. ఇంకా మరికొన్ని వాక్యాలూ ఆనందునివే*

*సూత్రానువాదం*

నేను వినిన విధంబెట్టిదనిన, ఒకనొక సమయమున భగవానుడు శ్రావస్తి నగరమునందు అనాథపిండదుని అరామమైన జేతవనములో ఉండినాడు. ఆయనతో బాటు 1250 భిక్షువులు మరియూ మహాసత్త్వులైన బోధిసత్త్వులు అనేకమంది ఉండినారు.

ఒకనాటి ప్రొద్దున భగవానుడు భిక్షాపాత్రను తీసుకొని చీవరమును (cloak) కప్పుకొని భిక్షాటనము కొరకు శ్రావస్తి నగరమును ప్రవేశించినాడు. భిక్షాటన చేసి భుజించిన తరువాత భిక్షాపాత్రను చీవరమును యథాస్థానములో ఉంచి పాదప్రక్షాళనము చేసుకొని తన కొరకు ఏర్పాటయిన ఆసనము మీద పద్మాసనము వేసుకొని నడుమును నిటారుగా ఉంచి శ్వాసను గమనించుచు(ఆనాపానసతి చేస్తూ) కూర్చుండినాడు. ఆ తరువాత చాలా మంది భిక్షువులు భగవానుడు ఆసీనుడై యున్న ఆ ప్రదేశమునకు వచ్చి భగవంతుని పాదపద్మములకు శిరస్సు వంచి వందనము చేసి భగవంతునికి మూడు పర్యాయములు ప్రదక్షిణము చేసి ఒక వైపున ఒదిగి కూర్చుండినారు.



# 2. సుభూతి యొక్క అధ్యేషణ (request)

*అవతారిక:- బుద్ధునికి ముఖ్య శ్రావకులు (disciples) ఎనభైమంది. ఆ ఎనభైమందిలో సుభూతి ఒకడు. ఎవరూ ఏమీ అడక్కపోతే బుద్ధుడు అలానే ఆనాపానసతి చేస్తూ మౌనంగా ఉండిపోతాడు. ఏదంటే అది స్వయంగా మాట్లాడడు. ఆ దినం సుభూతి భగవానుణ్ణి సంభాషణ లోకి దింపుతాడు. సుభూతి అధ్యేషణ చేసిన తీరు గమనించదగినదిగా ఉన్నది. మనం ఉపదేశాల కొరకు అధ్యేషణ చేయడం లేదు. పుస్తకాలు తీసుకొని చదివేస్తున్నాము. తప్పు లేదు. కానీ వజ్రచ్ఛేదికను పఠించేటప్పుడు అధ్యేషణాచిత్తం కలిగియుండాలి. వినయం, భక్తి, శ్రద్ధ, గౌరవం కలిగియుండాలి.*

*అనువాదం*

ఆ సమయమున గౌరవనీయుడైన సుభూతి కూడా ఆ పర్షదమునకు (assembly) వచ్చి కూర్చొనియున్నాడు. ఆ పిమ్మట సుభూతి ఆసనము నుండి లేచి రెండు మూపులను (shoulders) కప్పియున్న చీవరమును ఒక మూపునకు చేర్చి కుడి మోకాలును భూమి మీదికి ఆన్చి రెండు చేతులతో అంజలి ఘటించి భగవంతునికి ప్రణమిల్లి ఇట్లు పలికెను: “భగవాన్, ఆశ్చర్యము! సుగతా, పరమాశ్చర్యము! తథాగతులు అర్హతులు సమ్యక్ సంబుద్ధులు అయిన మీచేత మహాసత్త్వులయిన బోధిసత్త్వులు అనుగ్రహింపబడిన తీరు ఆశ్చర్యము! కరుణింపబడిన తీరు పరమాశ్చర్యము! భగవాన్, బోధిసత్త్వయానములో ప్రయాణించుచున్న కులపుత్రుడుగానీ కులదుహిత గానీ (daughter of a good family) ఎట్లు నిలిచియుండవలెను? (అనివర్తుడుగా = nonback–sliderగా ఎట్లుండవలెను?). ఎట్లు పురోగమించవలెను? ఎట్లు చిత్తమును బోధిచర్యయందు లగ్నము చేయవలెను? “

*భగవానుడు:* సాధు సాధు (well said, well said) సుభూతీ. యథార్థమునే పలికితివి. తథాగతునిచే మహాసత్త్వులైన బోధిసత్త్వులు మిక్కిలి అనుగ్రహింపబడినారు. కరుణింపబడినారు. సుభూతీ, చెప్పెదను వినుము. మనస్సు పెట్టి చక్కగా వినుము. బోధిసత్త్వయానములో ప్రయాణించుచున్నవారు ఎట్లు స్థిరము చెందవలెను? ఎట్లు పురోగతి చెందవలెను? ఎట్లు చిత్తమును అదుపు చేయవలెను? చెప్పెదను.

Note:- బుద్ధుని సహాయము, అనుగ్రహము ఒక శాస్తగా (teacher) అని గ్రహించాలి. వరములు ఇవ్వడం ద్వారా కాదు. సంసార పంకంలో కూరుకొని పోవుచున్న జనులకు ధర్మదేశనం అనే హస్తమును అందించి వాళ్లను బైటకు లాగినాడు. ఆ విధమైన సహాయము అనుగ్రహము బోధిసత్త్వులు కూడా బుద్ధుని నుండి పొందినారు.



# 3. మహాయాన సందేశము (Teaching of the Great vehicle)

*అవతారిక:- దుఃఖ దుఃఖతా (suffering as pain), విపరిణామ దుఃఖతా (suffering in change), సంస్కార దుఃఖతా (suffering inherent in the formations) అని దుఃఖం మూడు విధాలుగా ఉన్నది. మొదటిది అందరికీ అనుభవంలో ఉన్నదే. ఇక రెండవది: ఎండలో కూర్చుంటే సుఖం అనిపించింది. సుఖంగా ఉంది కదా అని అలానే కాసేపు ఉన్నాక తెలిసింది సుఖం పోయిందని. ఇది విపరిణామ దుఃఖం. ఇక మూడవది:ఇప్పుడు ఆరోగ్యంగా బలంగా సంతోషంగా హాయిగా సుఖంగా ఉన్నాను. కానీ ఈ దేహ నిర్మాణం ఎటువంటిదంటే ఎప్పుడో ఒకప్పుడు దుఃఖంలో ముంచబోయేదే (liable to get pain). ఈ చివరి రకమైన దుఃఖం దేవతలకు కూడా తప్పదు. పుణ్యం క్షీణించగానే దేవతల శరీరాలు మంచులాగ కరిగిపోతున్నప్పుడు వాళ్లు అనుభవించే దుఃఖం ఇంతా అంతా కాదు. అశ్వఘోషుని సౌందరనంద కావ్యం నుండి:*

*హా చైత్రరథ హా వాపి హా మందాకినీ హా ప్రియే*
*ఇత్యార్తా విలపంతోఽపి గాం పతంతి దివౌకసః*

*"అయ్యో చైత్రరథమా, అయ్యో తటాకమా, అయ్యో మందాకినీ, అయ్యో ప్రియా" అని వియోగ బాధతో విలపిస్తూ కర్మఫలం తీరిపోయిన దేవలోకవాసులు భూమి మీదకు వచ్చి పడతారు.*

*కనుక ఈ త్రైధాతుకంలో (three realms of existence. కామధాతువు = desire realm, రూపధాతువు = form realm, అరూపధాతువు = formless realm) ఏ లోకం వెళ్లినా దుఃఖం తప్పదు. చిత్తాన్ని పూర్తిగా ఉపశమింప జేయగలిగితే ఆ క్షణమే చిత్తదృశ్యమైన త్రైధాతుకం, త్రైధాతుకంలోని వివిధ లోకాలు, ఆ లోకాల్లోని నానా రకాల సత్త్వులు మొత్తం మాయమవుతాయి-మేలుకొన్నాక స్వప్నం మాయమయినట్లు.*

దుఃఖ నివృత్తికి ఇదియే పరిష్కారం. "త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో ఉన్నట్టి అసంఖ్యాక జీవులను అందరినీ నిరుపధిశేష నిర్వాణంలోకి చేర్చాకగానీ నేను నిర్వాణం చెందను" అనే బోధిసత్త్వ ప్రణిధికి (resolution) అర్థం ఇదే.

చిత్తాన్ని ఉపశమింప జేయడానికి బోధిసత్త్వులు ప్రధానంగా రెండింటిని ఆశ్రయిస్తారు. 1.కరుణ (అహింస =compassion), 2. ప్రజ్ఞ (insight). సత్కాయ దృష్టిని (idea of an ego entity, a personality, a being, a seperated individuality) ప్రజ్ఞ సడలించడం మొదలు పెట్టడంతో బాహ్యంగా దైనందిన వ్యవహారం కరుణా ప్రేరితం కావడం మొదలవుతుంది. బోధిసత్త్వుడనే పక్షి ప్రజ్ఞ, కరుణ అనే రెక్కల సహాయంతో ధర్మకాయం అనే గూటికి ప్రయాణం మొదలు పెట్టాడు. ముందుకు పోవడమే గానీ వెనుదిరగడం ఉండదు.

సత్కాయదృష్టి అనే గుదిబండతో అధ్యాత్మిక మార్గంలో ఒక అడుగు కూడా ముందుకు సాగదు. సత్కాయదృష్టి క్లేశాలను (రాగదేష్వాదులను) పుట్టిస్తూ ఉంటుంది కనుక క్లేశాల నిర్మూలనకు నడుం బిగించిన బోధిసత్త్వుడు అరకొర ప్రయత్నాలతో సరిపెట్టు కొనడు. వజ్రాయుధంతో (శూన్యతా శస్త్రంతో)మూలాన్ని చావు దెబ్బ కొట్టాడు.

## అనువాదం

*భగవానుడు:* సుభూతీ, బోధిసత్త్వయానములో ప్రయాణించుచున్నవాడు ఈ విధముగా బోధిచిత్తమును కలిగించుకొనవలెను: "ఈ త్రైధాతుకములో (triple universe) సత్త్వులుగా (sentient beings) ఏవేవి తెలియబడుచున్నవో అవి అండజములుగానీ (egg–born), జరాయుజములుగానీ (born from womb), సంస్వేదజములుగానీ (moisture–born), ఔపపాదుకములుగానీ (miraculously born, apparitional beings), రూపిణులుగానీ (with fine material form), అరూపిణులుగానీ (without form), సంజ్ఞినులుగానీ (with perception), అసంజ్ఞినులుగానీ (without perception) నైవసంజ్ఞానాసంజ్ఞినులుగానీ (with

neither perception nor non–perception) ఇంకనూ ఏవేవి సత్త్వలుగా తెలియబడుచున్నవియో ఈ అందరినీ నేను నిరుపధిశేష నిర్వాణములో (Nirvana which leaves nothing behind, reminderless nirvana) చేర్పించవలసిన బాధ్యతను తీసుకొనుచున్నాను." సుభూతీ, ఈ విధమైన నిశ్చయముతో బోధిసత్త్వుడు అసంఖ్యాకమైన సత్త్వులను నిర్వాణము చెందించినప్పటికీ అతని చేత ఒక సత్త్వుడు కూడా నిర్వాణము చెందింపబడలేదు. ఎందువలన? బోధిసత్త్వునిలో సత్త్వసంజ్ఞ (notion of a being) తలెత్తినచో ఇక అతనిని బోధిసత్త్వుడనరాదు. ఎవనియందు ఆత్మసంజ్ఞ (notion of a self), సత్త్వసంజ్ఞ (notionof a being), జీవసంజ్ఞ (notion of a living soul), పుద్గలసంజ్ఞ (notion of a person) తలెత్తినదో అట్టి వానిని బోధిసత్త్వుడని చెప్పతగదు.



# 4. పారమితల అభ్యాసం (practice of the perfections)

*అవతారిక:- దానం, శీలం, క్షాంతి, వీర్యం, ధ్యానం, ప్రజ్ఞ - ఇవి బోధిసత్త్వుడు అభ్యసించవలసినట్టివి. బోధిచిత్త స్వీకారం మొదలుకొని బుద్ధత్వ ప్రాప్తి వరకు కొనసాగే ప్రయాణంలో అతడు ఒక్కొక్క భూమికను (stage/ground) అధిరోహిస్తూ పురోగమించవలసి యుంటుంది. దశ భూమికల పేర్లు: 1. ప్రముదిత (Joyous), 2. విమల (immaculate), 3. ప్రభాకరి (luminous), 4. అర్చిష్మతి (radiant), 5. సుదుర్జయ (unconquerable), 6. అభిముఖి (directly facing), 7. దూరంగమ (far advanced), 8. అచల (immovable), 9. సాధుమతి (unerring intellect), 10. ధర్మమేఘ (cloud of Dharma).*

*ఈ పది భూమికలలో ఏడవ భూమిక నుండి పదవ భూమిక వరకు సరిపోయే విధంగా మరో నాలుగు పారమితలు కూడా చెప్పబడినాయి.*

1. *ఉపాయ కౌశల్య పారమిత (skill in means),*
2. *ప్రణిధాన పారమిత (perfection of the vow),*
3. *బలపారమిత (perfection of powers),*
4. *జ్ఞానపారమిత (Perfection of knowledge)*

*వజ్రచ్ఛేదిక ఇక్కడ దానపారమితనే ప్రస్తావించినా దానిని తక్కిన పారమితలకు ఉపలక్షణంగా (indicating) తీసుకొనవలెను లేదా అన్ని పారమితలు దానపారమితలో ఇమిడిపోవడాన్నీ చూడవచ్చు. దానం మూడు విధాలు. 1. ఆమిషదానం (material help), 2. అభయదానం (giving of protection), 3. ధర్మదానం (gift of Dharma).*

అభయదానం అంటే తుపాకి పట్టుకొని కాపలా కాయడం కాదు. శీల క్షాంతి పారమితలను అభ్యసిస్తూ తనవల్ల ఇతరులకు ఎటువంటి నష్టమూ, అపకారమూ జరుగబోదని ఆచరణ ద్వారా మౌనంగా ప్రకటిస్తూ ఉండడమే అభయదానం. ధర్మదానం అంటే పుస్తకాలు చదివి ఉపన్యాసాలు ఇవ్వడం కాదు. అలా అయితే ఇంతకన్నా తేలిక పని మరొకటి లేదు. ధర్మదానం చేయాలంటే ధ్యానపారమితను ప్రజ్ఞాపారమితను చక్కగా అభ్యసించి అధ్యాత్మికమైన అనుభవాలను స్వయంగా పొంది ఆ అనుభవాలను ఇతరులు కూడా పొందేలా మార్గదర్శకత్వం (guidance) వహించడం. ఇక వీర్యపారమిత అన్ని రకాల దానాలకు చాలా అవసరమైన పారమిత. ఉదా:- వీర్యం (energy) లేనివాడు ఆమిషం (ధనం) గడించలేడు. ఇతరులకు ఇవ్వలేడు.

సరే, ఏ పారమితను అభ్యసించినా అభ్యసించేటప్పుడు బోధిసత్త్వుడు త్రైధాతుకపరిధికి లోబడిన ప్రయోజనముల (aims) మీద మనస్సు పెట్టకూడదు. లాభ (gain), సత్కార (honour), పూజలు (worship) పట్ల అత్యంత అనాసక్త చిత్తుడుగా ఉండవలెను. బోధిసత్త్వుడు పుణ్యం గడిస్తూనే ఉంటాడు కానీ దాని పట్ల కూడా అతని మనస్సు మురిసిపోదు. ఆ పుణ్యాన్ని ఎప్పటికప్పుడు బుద్ధత్వ ప్రాప్తికోసం పరిణామనం (transfering) చేసి వేస్తుంటాడు.

## అనువాదం

*భగవానుడు:-* సుభూతీ, బోధిసత్త్వుడయినవాడు వస్తు ప్రతిష్ఠితుడై (settling, clinging, abiding) దానము చేయరాదు. దేనియందునూ ప్రతిష్ఠితుడై దానము చేయరాదు. రూప ప్రతిష్ఠితుడై దానము చేయరాదు. శబ్ద గంధ రస స్ప్రష్టవ్యములయందు మరియూ ధర్మములయందు (mind–objects) ప్రతిష్ఠితుడై దానము చేయరాదు. ఈ విధముగా బోధిసత్త్వుడు ఏ నిమిత్త సంజ్ఞయందునూ (notion of a sign) ప్రతిష్ఠితుడు

కాకుండా దానము చేయవలెను. ఎందులకనగా, ఏ బోధిసత్త్వుడు అప్రతిష్ఠితుడై* (unattached) దానము చేయునో దానివలన అతనికి కలిగెడి పుణ్యరాశి యొక్క పరిమాణమును అంచనా వేయుట సాధ్యము కాదు. సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తూర్పు దిశగా విస్తరించియున్న ఆకాశము (space) యొక్క పరిమాణమును (measure) తెలుసుకొనుట సాధ్యమా?

*సుభూతి:*- కాదు భగవాన్.

*భగవానుడు:*- అటులనే దక్షిణము, పశ్చిమము, ఉత్తరము, అధోదిశ, ఊర్ధ్వదిశ, ఆగ్నేయ, నైరుతి, వాయువ్య ఈశాన్య మొత్తము పది దిశలయందు విస్తరించియున్న ఆకాశము యొక్క పరిమాణమును తెలుసుకొనుట సాధ్యమా?

*సుభూతి:*- కాదు భగవాన్

*భగవానుడు:*- ఆ విధముగానే సుభూతీ, ఏ బోధిసత్త్వుడు అప్రతిష్ఠితుడై దానము చేయునో దానివలన అతనికి కలిగెడి పుణ్యరాశి యొక్క పరిమాణమును అంచనా వేయుట సాధ్యము కాదు. కనుకనే సుభూతీ, బోధిసత్త్వయానములో ప్రయాణించువారలు నిమిత్త సంజ్ఞలయందు ప్రతిష్ఠితులు కాకుండా దానము చేయవలెను.

---

* అప్రతిష్ఠిత పదానికి 21 అర్థాలున్నాయని Edward Conzeగారు చెప్పారు. హిమాలయంలోని ఒక మర్కటంలాగా కాకుండా తామరపువ్వులాగా జీవించమని అప్రతిష్ఠిత (unattached) వాక్యం చెబుతున్నది. తామరపువ్వు నివాసం నీటిలోనే, కానీ నీటిని అతుక్కోనీయదు. హిమాలయంలోని ఆ మర్కటాన్ని తలచుకొంటే జాలి వేస్తుంది. కోతులను పట్టుకొనేందుకు వేటగాడు హిమాలయంలో ఒక చోట sticky trap ఉంచాడు. తెలివియున్న కోతులు దాని జోలికి వెళ్లలేదు. మూర్ఖమైన ఒక మర్కటం పేరాశ ప్రేరేపించగా వేగంగా దుముకుతూ వెళ్లి దాన్ని ఒక చేత్తో పట్టుకొనింది. ఆ చేయి అతుక్కుపోయింది. దాన్ని విడిపించడం కోసం మరో చేతితో ప్రయత్నిస్తే అదీ అతుక్కుపోయింది. ఆ రెండు చేతులను విడిపించడం కోసం ఒక పాదంతో trapని తన్నింది. ఆ పాదమూ అతుక్కుపోయింది. ఈ మూడింటిని విడిపించడం కోసం మరో పాదంతో ఆ trapని బలంగా తన్నగానే అదీ అతుక్కుపోయింది. ఈ నాలిగింటినీ విడిపించడం కోసం చివరి ఉపాయంగా మూతితో ఆ trapని కుమ్మే ప్రయత్నం చేయగా అదీ అతుక్కుపోయింది. ఆపైన ఇక చేసేది ఏమీలేక 'కుయ్యో కుయ్యో' అని దీనంగా కూతలు పెట్టసాగింది.

(సంయుక్త నికాయం నుండి)

# 5. మహాపురుష లక్షణాలు (marks of the superman)

*అవతారిక:- బుద్ధవిగ్రహాలు ఎన్నో దేశాల్లో ఎన్నో విధాలుగా ఉండినప్పటికీ చూచిన వెంటనే 'బుద్ధుడు' అని గుర్తించగలుగుచున్నాము. విగ్రహంలో కనిపించే కొన్ని ప్రత్యేక లక్షణాల (marks) వల్ల ఈ గుర్తింపు వెంటనే జరిగిపోతుంది. లుంబినిలో జనించి కుశీనగరంలో మరణించిన భౌతిక రూపానికి ప్రతిరూపాలు కావు ఈ విగ్రహాలు. బుద్ధుని సమకాలీనుల్లో చాలా మంది పుణ్యాత్ములకు బుద్ధుని దివ్య భౌతికరూపం (రూపకాయం) గోచరించేది. తరువాతి కాలంలోనూ చాలా మంది ధ్యానులకు బుద్ధుని దివ్యరూపం గోచరించేది. ఈ దివ్యరూపం యొక్క పోలిక రూపాలే విగ్రహాలు. భక్తులకు యోగులకు సాక్షాత్కారమైన దివ్యరూపం ముప్పైరెండు మహాపురుష లక్షణాలతోనూ (marks) ఎనభై అనువ్యంజనాలతోనూ (minor marks) విరాజిల్లే దేదీప్యమాన రూపం. ఈ రూపం యొక్క ఎత్తు 18 అడుగులు. కానీ ఇది కూడా బుద్ధికి గోచరమయ్యే సంవృతి రూపమే కనుక బుద్ధుని అసలు రూపం కాదు. అసలు రూపం ధర్మకాయం. అది బుద్ధికి గోచరం కాదు. నీళ్లలో నీళ్లు కలిసిపోయి ఏకం అయినట్లు బుద్ధి విలీనం అయి ఏకం కావలసిందే గానీ పరమార్థాన్ని ఘటపటాదుల్లాగా తెలుసుకోవడం ఉండదు. బాగా విచారిస్తే తెలియబడుచున్నదంతా దగా, మోసం, వంచన, భ్రాంతి మాత్రమే!*

## *32 మహాపురుష లక్షణములు

1. చక్రాంకితపాణిపాదతలతా

He has, stamped on the soles of his feet and the palms of his hands, lines depicting

*Edward Conze గారి The Large Sutra of Perfect Wisdom నుండి

ı wheel i.e. there grow wheels with a thousand spokes, with rims and naves, :omplete in every respect.

2. సుప్రతిష్ఠితపాణిపాదతలతా

The Lord's feet are well–placed, i.e. he places the entire soles of his feet evenly on the ground. Just as the bottom of a basket, when placed on an even base, touches the ground with the whole lower surface because it's bottom rests evenly.

3. జాలాబలబద్ధాంగుళిపాణిపాదతలతా

His hands and feet are joined by webs i.e. as with the royal goose

4. మృదుతరుణహస్తపాదతలతా

The soles of his feet and the palms of his hands are tender and soft i.e. his hands and feet are softer than those of others.

5. సప్తోత్సాదతా

He has seven prominences i.e. two below on the soles of his feet, two on the hands, two on his shoulder blades and one behind on his neck and they are all handsome. attractive and beautiful to behold.

6. దీర్ఘాంగుళితా

His toes and fingers are long i.e. they are longer than those of others

7. ఆయతపార్ష్ణితా

He has broad heels i.e. his two heels are broader than those of others

8. బృుజుగాత్రతా

His bodily frame is well–grown, tall and straight i.e. it is not crooked, not bent,

well–grown in all ways: it's height is seven cubits, and every thing is proportioned accordingly.

9. ఉత్సంగపాదతా

His feet have inconspicuous ankle bones i.e. his two ankle bones grow high up.

10. ఊర్ధ్వాగ్రరోమతా

The hairs on his body point upwards i.e. the hairs of his head and body grow in such a way that they are turned upwards; they are blue–black, soft, curl in rings, and turn to the right.

11. ఏణేయజంఘతా

His shanks are like those of the black antelope i.e. because his shanks are gradually tapering away, like those of the black antelope, king of deer.

12. ప్రలంబబాహుతా

His arms reach to his knees i.e. when he stands up, he can without bending down, whenever he wants, touch and stroke his kneecaps, with the two palms of his hands.

13. కోషగతవస్తిగుహ్యతా

His——is hidden in a sheath i.e. as in the case of a noble thorough-bred elephant or horse.

14. సువర్ణవర్ణతా

His skin has a golden hue making him handsome and attractive i.e. his body shines brightly just like a bar of gold.

15. శంక్ల చ్ఛవితా

His skin is smooth and delicate i.e. water and dust do not cleave to his body.

16. ప్రదక్షిణావర్తైకరోమతా

The hairs on his body stand separately i.e. in each hairpore there grows only one single hair, which is soft, curls in rings and turns to the right.

17. ఊర్ణాలంకృతముఖతా

He has a tuft of hair between his eyebrows i.e. a tuft of hair grows between his eyebrows which is very white and soft, resembles a tuft of cotton, and is not in touch with his eyebrows–the hairs turning to the right and curling in rings.

18. సింహపూర్వాంతకాయతా

The upper part of his body is like that of a lion, i.e. it is large like that of the lion, king of beasts

19. సుసంవృత్తస్కంధతా

His shoulders are gently curved, i.e. because they are muscular, his shoulders are everywhere amply developed.

20. చితాంతరాంసతా

The interval between his shoulders is well filled i.e. his chest is wide and elevated.

21. రసరసాగ్రతా

He has taste conductors which give him the most excellent taste, i.e. the taste conductors in his throat are quite straight: those in his tongue are not twisted or bloodless; since his nerves are so well endowed, his body is supremely fit.

22. న్యగ్రోధపరిమండలతా

The circumference of his body is like that of the fig tree i.e. as great as he is in height, so great is he in width; as great as he is in width, so great is he in height.

23. ఉష్ణీషశిరస్కతా

There is a cowl on his head i.e. his head is well rounded and through the large circumference of the cowl it looks exceedingly beautiful

24. ప్రభూతజిహ్వతా

His tongue is long i.e. when he desires to do so he touches and strokes with this tongue the apertures of his two ears., and he covers with his tongue the apertures of his two eyes and his entire face up to the hairs.

25. సింహహనుతా

He has jaws like a lion, i.e. his Jaws are well rounded, as those of the lion.

26. శుక్లహనుతా

His teeth are very white, i.e. they shine brilliantly.

27. సమదంతతా

His teeth are equal in size, because not some teeth are higher and some lower.

28. బ్రహ్మస్వరతా

His voice is like that of Brahma i.e. his voice can be heard as clear in a large assembly as in the inside of a room and his speech is as charming as the song of the kalavinka bird.

29. అవిరళదంతతా

There are no gaps between his teeth, i.e. his teeth are close together

30. సమచత్వారింశద్దంతతా

He has a total of forty teeth i.e. twenty below and twenty above

31. అభినీలనేత్రతా

His eyes are intensely black i.e. the black of his eyes is pure black and the white pure white

32. గోపక్షనేత్రతా

His eye lashes are like those of a magnificent heifer, i.e. his eye lashes are like those of a great bull, those below are Just below and those above are just above; and they are in no way disarranged.

అనువాదం

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? లక్షణసంపద కలిగినవాడుగా తథాగతుని చూడదగునా?

*సుభూతి:-* చూడరాదు భగవాన్. తథాగతుడిని లక్షణసంపద కలవాడుగా చూడరాదు. ఎందులకనగా తథాగతులవారు భాషించిన లక్షణ సంపద ఏదియో అది వాస్తవమునకు అలక్షణసంపద.

*భగవానుడు:-* అవును సుభూతీ. లక్షణసంపద అనునది మృషా (fraud). అలక్షణసంపద మృషా కాదు (not fraud). కనుక సుభూతీ, తథాగతుడిని లక్షణశూన్యుడుగా చూడవలెను.

# 6. 2500 ఏండ్ల తరువాత? (క్రీ.శ.1956)

*అవతారిక:- 'శాసనం భిక్షుతా మూలం' అన్నాడు శాంతిదేవుడు. శాసనం అంటే బుద్ధుని బోధనలు. ఈ బోధనలు అనే వృక్షం, లోకంలో జీవించియుండాలంటే భిక్షుసంఘం అనే మూలం (roots) అవసరం. భిక్షువులు ఐదు రకాలు: 1. సంజ్ఞాభిక్షువు, 2. ప్రతిజ్ఞాభిక్షువు, 3. భిక్షణశీల భిక్షువు, 4. జ్ఞప్తిచతుర్థకర్మణోపసంపన్న భిక్షువు, 5.భిన్నక్లేశభిక్షువు. మొదటి మూడు రకాలు బూటకం భిక్షువులు. నాలుగవ రకం భిక్షువు భిక్షునియమాలను తప్పక పాటిస్తూ ప్రయత్నశీలుడుగా ఉన్నవాడు. ఐదవ రకం భిక్షువు నిజమైన భిక్షువు. క్లేశాలను* తుడిచిపెట్టినవాడే నిజమైన భిక్షువు. శాసనం అనే వృక్షం నిలవాలంటే నాలుగవ రకం ఐదవ రకం భిక్షువుల అవసరం ఉన్నది. బుద్ధుని కాలంలోనే భిక్షువులకు శాసనం యొక్క చిరకాలం మనుగడ మీద సంశయాలు తలెత్తాయి. మొదటి 500 ఏండ్లు శాసనం పటిష్ఠంగా ఉండి ఆ తరువాత ప్రతి 500 ఏండ్లకు పతనావస్థలకు లోనయి 2500 ఏండ్ల తరువాత పూర్తిగా అంతరించి పోతుందని నమ్మడం మొదలు పెట్టారు. సుభూతి ఆ నమ్మకం తోనే క్రింది ప్రశ్నను అడగబోతున్నాడు.*

*అనువాదం*

*సుభూతి:-* భగవాన్, రాబోవు భవిష్యకాలములో చివరి ఐదవ ఐదువందల సంవత్సరముల కాలములో (2500 ఏండ్ల తరువాత) సద్ధర్మము (good law) నశించిపోవు ఆ కాలములో ఇటువంటి గంభీరమైన సూత్రవాక్యములను భాషించినపుడు అర్థము చేసుకొనగలిగినవారలు ఎవరైనను ఉందురా?

---

*రాగము = greed, ద్వేషము = hate, మోహము = delusion, మానము = conceit, దృష్టి = dogmaticism, విచికిత్స = doubt, స్త్యానం = mental laziness, ఔద్ధత్యం = restlessness, అహ్రీకం = shamelessness, అనపత్రాప్యం = లజ్జలేనితనం

*భగవానుడు*:- సుభూతీ, అటుల పలుకవద్దు. రాబోవు భవిష్యకాలములో చివరి ఐదవ ఐదువందల సంవత్సరముల కాలములోనూ సద్ధర్మము నశించిపోవుచున్న ఆ కాలములోనూ ఈ సూత్రవాక్యములను భాషించినపుడు అర్థము చేసుకొనువారలు కొందరు ఉందురు. అప్పుడు కూడా ఈ వాక్యములను అర్థము చేసుకొనగల గుణవంతులు, శీలవంతులు, ప్రజ్ఞావంతులు ఉందురు. అట్టివారు కేవలము ఒక బుద్ధుని మాత్రమే ఉపాసించినవారుగా (honoured), ఒక బుద్ధుని పర్యవేక్షణలో మాత్రమే కుశల మూలములను (roots of merit) నాట్లు (planting) వేసుకొనినవారుగా ఉండబోరు. మరి ఎటువంటివారుగా ఉందురని అడిగెదవేని చెప్పెదను వినుము. ఈ సూత్ర వాక్యములను వినినప్పుడు వారిలో ఏకచిత్త ప్రసాదము (one single thought of serene faith) కలిగిననూ వారు ఆ క్షణమే అనేక లక్షల బుద్ధులను ఉపాసించిన పుణ్యాత్ములుగానూ అనేక లక్షల బుద్ధుల పర్యవేక్షణలో కుశల మూలముల నాట్లు వేసుకొనిన పుణ్యాత్ములుగానూ అయిపోవుదురు. బుద్ధజ్ఞానము ద్వారా తథాగతుడు వారిని తెలుసుకొనినాడు. బుద్ధచక్షువు ద్వారా తథాగతుడు వారిని చూచినాడు. వారలందరూ తథాగతునికి బాగుగా తెలియబడినారు. వారలందరూ అప్రమేయమైన (immeasurable), అసంఖ్యేయమైన (incalculable) పుణ్యస్కంధమును (రాశిని) గడించబోవుచున్నారు. ఎందులకనగా మహాసత్త్వులయిన ఆ బోధిసత్త్వులయందు ఆత్మసంజ్ఞ (perception of self) కలుగబోదు కనుక. సత్త్వసంజ్ఞ (perception of a being), జీవసంజ్ఞ (perception of a soul), పుద్గలసంజ్ఞ (perception of a person) వారియందు కలుగబోదు కనుక. మరియూ వారియందు ధర్మసంజ్ఞయూ (perception of a dharma), అధర్మ సంజ్ఞయూ (perception of a no–dharma) కలుగబోదు. సుభూతీ, ఇంకనూ వారియందు సంజ్ఞయూ (perception) అసంజ్ఞయూ (non-perception) కూడా కలుగబోదు. ఎందుకని అడిగెదవేని, సుభూతీ వినుము. మహాసత్త్వులయిన ఆ బోధిసత్త్వులకు ధర్మసంజ్ఞ (perception of a dharma) కలిగినచో అదియే వారిలో ఆత్మగ్రాహమును (seize on a self), సత్త్వగ్రాహమును, జీవగ్రాహమును, పుద్గలగ్రాహమును కలిగించివేయును. అటులనే అధర్మసంజ్ఞయూ (perception of no–dharma)

ఆత్మగ్రాహమును, సత్త్వగ్రాహమును, జీవగ్రాహమును, పుద్గలగ్రాహమును కలిగించివేయును. కనుక సుభూతీ, మహాసత్త్వుడైన బోధిసత్త్వుడు ధర్మమునూ పట్టుకొని వ్రేలాడరాదు. (should not seize on a dharma). అధర్మమునూ (no–dharma = emptiness) పట్టుకొని వ్రేలాడరాదు. కనుకనే తథాగతుడు సంధా భాషలో (twilight language = language with hidden meaning) పూర్వము ఈ విధముగా భాషించియున్నాడు: "ధర్మపర్యాయము (discourse on dharma), తెప్ప (raft) వంటిదని ఎరిగినవారలు ధర్మములను వదలివేయవలెను, అధర్మములను అంతకు మునుపే వదలి వేయవలెను" అని.

Note:- సూత్రపిటకంలోని ఐదు నికాయాల్లో ఒకటయిన మధ్యమ నికాయంలో బుద్ధుడు తన బోధనలను కోలంతో (raft = తెప్ప) పోల్చుతాడు. సంసారనదిని దాటడం వరకే వాటి ఉపయోగం. నదిని దాటినవాడు తెప్పను నెత్తిన బెట్టుకొని తిరగడు. తెప్పను పొగుడుతూ పూజిస్తూ అక్కడే కూర్చోడు. వదిలేసి పోతాడు. ఈ కోలోపమ వాక్యంలో వేరే గూఢార్థం కూడా ఉందని బుద్ధుడు ఇక్కడ తెలుపుతున్నాడు. ఉంది(అస్తి = is), లేదు (నాస్తి = is not) అనే ద్వయం (duality) నుండి చిత్తాన్ని విముక్తం చేస్తేనే ధర్మకాయంలో ప్రవేశం. దీనిని ఎక్కువ వివరించకుండా ఒక దృష్టాంతం మాత్రమే చూపుతాను. యజ్ఞదత్తుడు, దేవదత్తుడు జంటపూజారులు. ఇద్దరూ, మధ్యలో ఒక పళ్లెరం ఉంచుకొని ఎదురెదురుగా కూర్చొని అర్చన కోసం బుట్ట నుండి మంచి పుష్పాలను ఎంపిక చేసి పళ్లెరంలో వేస్తున్నారు. ఎంపిక చేసి పళ్లెరంలో వేసిన పుష్పాలను కొన్నిటిని దేవదత్తుడు మళ్లీ తీసి క్రింద పారవేస్తున్నాడు. "ఎందుకు అలా చేస్తున్నావు?" అని యజ్ఞదత్తుడు అడిగాడు. "వెంట్రుకల చేత అవి అపవిత్రములైనాయి. పూజకు తగవు" అన్నాడు దేవదత్తుడు. యజ్ఞదత్తుడు ఆ పుష్పాలను చూశాడు. వెంట్రుకలు కనిపించలేదు. "దేవదత్తా, ఈ పని నేను చూసుకొంటాను. నీవు వెంటనే నేత్రవైద్యుడిని సంప్రదించు. నీ నేత్రాలకు తిమిరరోగం ఉన్నట్లున్నది. లేని వెంట్రుకలు నీకు కనిపిస్తున్నాయి" అన్నాడు. యజ్ఞదత్తుడు అబద్ధం చెప్పడని దేవదత్తునికి తెలుసు. మళ్లీ ఆ పుష్పాలను చూశాడు. వెంట్రుకలు కనిపిస్తూనే ఉన్నాయి. కానీ యజ్ఞదత్తుని వాక్యాన్ని ఆప్తవాక్యంగా తీసుకొన్నాడు కనుక కనిపించే ఆ వెంట్రుకలను

మిథ్య (illusion) అనుకొని లేచాడు.

"ఉన్నాయి" అనే దేవదత్తుని తప్పు జ్ఞానాన్ని నిషేధిస్తూ యజ్ఞదత్తుడు "లేవు" అన్నాడు. ఉన్నదాన్ని లేదని నిషేధించలేదు (negate చేయలేదు). ఉండి మళ్లీ కనిపించకుండా పోయిన వైనాన్ని తెలపడం కోసమూ "లేదు" పదాన్ని వాడలేదు. ఆ వెంట్రుకల విషయంలో యజ్ఞదత్తుడికి అస్తి(ఉంది), నాస్తి (లేదు) పదాలు రెండూ అర్థశూన్య పదములు (meaningless words) అవుతాయి.

శూన్యత (emptiness) అనేది ఔషధం లాంటిది. దృష్టిరోగాలను (diseases of false views) తొలగించడం వరకే దాని ఉపయోగం. దానిని ఒక దృష్టిగా (view) మార్చుకొని పట్టుకొని వ్రేలాడడం శ్రేయస్కరం కాదు. బుద్ధుడు ఒక సూత్రంలో చక్కగా హెచ్చరించాడు: మేరుపర్వతం అంత సత్కాయదృష్టియైనా ఉంచుకోవచ్చు కానీ అణుమాత్రమైనా సరే శూన్యతాదృష్టి మాత్రం వద్దు.



# 7. ప్రపంచోపశమం (cessation of all talk)

అవతారిక:- అష్టసాహస్రిక ప్రజ్ఞాపారమిత నుండి కొన్ని వాక్యాలను ఎత్తి చూపడం వరకే ఈ అవతారికను పరిమితం చేస్తాను.

భగవానుడు:- సుభూతీ, సర్వధర్మములను అకృతములుగా (not made) తథాగతుడు తెలుసుకొనినాడు.

సుభూతి: కనుక తథాగతుల వారికి ధర్మములు ఏవియూ తెలియబడలేదు!

భగవానుడు:- ప్రకృతిని (own essential nature) కలిగిన ధర్మములు ఏవియూ లేవు. ఏది ప్రకృతియో అది అప్రకృతి (no-nature). ఏది అప్రకృతియో అది ప్రకృతి. ఎందుకంటే అన్ని ధర్మాలు ఏకలక్షణం (mark) కలిగి యున్నాయి. అలక్షణమే (no mark) ఆ ఏకలక్షణం. కనుక సమ్యక్‌సంబోధి ద్వారా తథాగతుడు ఏ ధర్మములనూ తెలుసుకొనలేదు. ఎందుకంటే ధర్మములకు రెండు ప్రకృతులు (two natures) లేవు. అన్ని ధర్మముల ప్రకృతి ఒకటే. అన్ని ధర్మముల ఆ ప్రకృతి (true nature) ఏదియో అది అప్రకృతి (no-nature). ఏది అప్రకృతియో అది ప్రకృతి. ఇలా తెలిసినపుడు మాత్రమే అన్ని సంగకోటులు (all points of attachments) వదలిపోతాయి.

* * * * *

సుభూతి:- అనుత్తర సమ్యక్ సంబోధి కలగడం కష్టం, చాలా కష్టం అని భగవానులంటున్నారు. అనుత్తర సమ్యక్ సంబోధిని పొందే ధర్మము అసలే లేదు కదా! ఎందుకంటే సర్వధర్మములు శూన్యములు (empty of own being) కనుక. వదిలించు కొనవలసిన ధర్మములూ లేవు. సంపాయించవలసిన ధర్మములూ లేవు. తెలుసుకొనే ధర్మమూ లేదు. తెలియబడే ధర్మమూ లేదు. అన్ని ధర్మములు శూన్యములు. కనుక

*అనుత్తర సమ్యక్ సంబోధి కలగడం కష్టం కాదు, చాలా కష్టమూ కాదు.*

*భగవానుడు:- సుభూతీ, సమ్యక్సంబోధి అసంభవం (causeless) కనుక కష్టమని చెప్పాను. అసద్భూతం (cannot take place) కనుక కష్టమని చెప్పాను. అవికల్పం (not fabricated) కనుక కష్టమని చెప్పాను. అవితథం (not fictitious) కనుక కష్టమని చెప్పాను.*

* * * * *

*సుభూతి:- భగవాన్, తథతాకు (suchness) భిన్నంగా ఏ ధర్మమూ తెలియబడనపుడు (not apprehended) అనుత్తర సమ్యక్ సంబోధిని పొంది తథతాలో నిలిచే ధర్మము ఏది? ఎవరు ఈ ధర్మదేశనం చేసేది?*

*భగవానుడు:- తెలియబడలేనిదిగానే తథతా కూడా అగుచుండగా ఇక అందులో నిలబడబోయే ధర్మం గురించి చర్చ ఎందుకు? సమ్యక్ సంబోధిని తథతా పొందడం లేదు. సమ్యక్ సంబోధిని పొందిన, పొందుచున్న, పొందబోవుచున్న ధర్మము ఏదియూ ప్రత్యేకముగా లేదు. ధర్మదేశనాన్ని తథతా చేయడం లేదు. ధర్మదేశనం చేసే మరో ధర్మమూ తెలియబడుట లేదు.*

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? అనుత్తర సమ్యక్ సంబోధియని (the supreme right and perfect enlightenment) తథాగతుడు తెలుసుకొనిన ధర్మము ఏదైనా ఉన్నదా? తథాగతుడు బోధించిన ధర్మము ఏదైనా ఉన్నదా?

*సుభూతి:* భగవానుడు భాషించిన వాక్యములను నేను అర్థము చేసుకొనిన ప్రకారము చెప్పవలసినచో తథాగతుడు అనుత్తర సమ్యక్ సంబోధియని తెలిసికొనిన ధర్మము ఏదియూ లేదు. బోధించిన ధర్మము కూడా ఏదియూ లేదు. ఎందులకనగా తథాగతుడు తెలుసుకొనిన ధర్మముగానీ బోధించిన ధర్మముగానీ అది అగ్రాహ్యము (cannot be grapsed), అనభిలాప్యము (cannot be talked about). అది ధర్మమూ కాదు, అధర్మమూ(no–dharma) కాదు. ఎందులకనగా ఆర్యపుద్గలులు (Holy persons)

అసంస్కృతము (unconditioned Reality) వలన ప్రభావితులు కనుక.

Note:- మనుష్యులు రెండు రకాలు. 1.పృథక్ జనులు (worldlings), 2.ఆర్యులు (noble persons). నాలుగు ఆర్యసత్యాల (four noble truths) భావన ద్వారా సత్కాయదృష్టిని (indiviuality view), విచికిత్సను (doubt), శీలవ్రత పరామర్శను (attachment to mere rules and rituals) వదిలించుకొన్నవాడు మార్గంలో ప్రవేశించినవాడవుతాడు, ఆర్యుడనబడతాడు. "ఇంకా మిగిలియున్న ఏడు సంయోజనాలను (fetters) ఛేదించినవాడు అర్హతుడు. స్రోతాపన్నునికి, అర్హతునికి మధ్య సకృదాగామి, అనాగామి అనే స్థాయిలున్నాయి. ఇలా వివిధ అధ్యాత్మిక స్థాయిల్లో ఉన్నవాళ్లనే సంఘం అంటారు. "సంఘం శరణం గచ్ఛామి" అనేటప్పుడు "శరణం గచ్ఛామి" మనుషులకు కాదు. ఆయా స్థాయిలకు కారణమైన ధ్యాన విజయాలకే (meditation stages/ achievements).



# 8. పుణ్యస్కంధము

*అవతారిక: గోదానం, భూదానం, అన్నదానం – ఇలా దానభేదాలు దేయవస్తువుల పేర్లతో చాలా ఉన్నాయి. దానం అనేది పుణ్యాన్ని (merit) కలిగించే ఒక క్రియా విశేషము. ఇచ్చే వస్తు విశేషాన్ని బట్టి ఎవరికి ఇవ్వబడుతున్నదో ఆ వ్యక్తులను బట్టి కూడా పుణ్యం ఉంటుంది. శ్రేష్ఠ వస్తువును శ్రేష్ఠవ్యక్తికి ఇస్తే ఆ పుణ్యం కూడా శ్రేష్ఠంగానే ఉంటుందని నమ్మకం. అందరికన్నా శ్రేష్ఠులు తథాగతులు. తథాగతులకు చేసే దానం యొక్క పుణ్యం ఎంత ఉంటుందో చెప్పడం మన తరం కాదు. పుణ్యం రెండు రకాలు. 1.పరిభోగాన్వయం పుణ్యం, 2.త్యాగాన్వయం పుణ్యం. తీసుకొన్నవాడు ఆ వస్తువును అనుభవిస్తే ఇచ్చినవానికి కలిగే పుణ్యాన్ని పరిభోగాన్వయం పుణ్యం అంటారు. తథాగతులు వస్తువులను అనుభవించరు కనుక వారికి చేసే దానం వల్ల దాతలకు పరిభోగాన్వయం పుణ్యం కలుగదు. కానీ మరొక రకమైన పుణ్యం త్యాగాన్వయం పుణ్యం కలుగుతుంది. వస్తువులు స్వంతంగా ఏమీ లేని వాళ్లు కూడా అపారమైన పుణ్యం గడించే ఉపాయాన్ని వజ్రచ్ఛేదిక చెప్పబోతున్నది. పుణ్యం గడించడం ఎందుకంటే భవిష్యత్తులో జీవితం సుఖంగా ఉండటానికి లేదా జ్ఞానార్జనకు అనువైన పరిస్థితుల ప్రాప్తి.*

*అనువాదం*

*భగవానుడు:-* ఎవరయినా కులపుత్రుడుగానీ కులదుహితగానీ ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువును (world system of 1,000 million worlds = galactic system) సప్తరత్నములతో (gold, silver, lapis–lazuli, coral, gems, diamonds, pearls) నింపి అర్హతులు సమ్యక్ సంబుద్ధులు అయిన తథాగతులకు దానము చేసినచో ఆ కులపుత్రునికిగానీ కులదుహితకుగానీ ఆ దానము వలన గొప్ప పుణ్యస్కంధము(రాశి) కలుగును కదా! నీవేమనుకొనుచున్నావు?

*సుభూతి:* బహుపుణ్యస్కంధము భగవాన్, బహుపుణ్యస్కంధము సుగతా! ఎందులకనగా తథాగతులవారు భాషించిన పుణ్యస్కంధము (heap of merit) నిజమునకు అస్కంధము (non–heap)! కనుకనే తథాగతులవారు పుణ్యస్కంధము, పుణ్యస్కంధము అని భాషించుచున్నారు.

*భగవానుడు:* ఎవరయితే ఈ ధర్మపర్యాయమును (discourse on dharma) కనీసము నాలుగు పాదములనైననూ గ్రహించి ఇతరులకు తెలియజేయుదురో అట్టివారు ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువును సప్తరత్నములతో నింపి సమ్యక్ సంబుద్ధులు అర్హతులు అయిన తథాగతులకు దానము చేసి పొందిన పుణ్యము కంటె ఎక్కువ పుణ్యస్కంధమును గడించుదురు. ఆ పుణ్యము అప్రమేయము (immeasurable), అసంఖ్యేయము (incalculable). ఎందులకనగా, సమ్యక్ సంబుద్ధులు అర్హతులు అయిన తథాగతులకు అనుత్తర సమ్యక్ సంబోధి, ప్రజ్ఞాపారమిత వలననే కలిగినది కనుక. ప్రజ్ఞాపారమితయే బుద్ధులకు జనని కనుక. ఎందులకనగా, బుద్ధధర్మములు బుద్ధధర్మములు అని తథాగతుడు భాషించినది నిజమునకు అబుద్ధధర్మములు! కనుకనే అవి బుద్ధధర్మములని చెప్పబడినవి.

Note:- బుద్ధధర్మములు

అష్టాదశ ఆవేణిక ధర్మములు (18 special dharmas of Buddha):

(From the night when the Tathagata knew full enlightenment, to the day when he becomes extinct in Nirvana, during all this time, the Tathagata)

1. నాస్తి తథాగతస్య స్ఖలితమ్ = Does not stumble.
2. నాస్తి రవితమ్ =not rash or noisy in his speech.
3. నాస్తి ముషితస్మృతితా = He is never deprived of mindfulness.
4. నాస్త్యసమాహితచిత్తమ్ = His thought is never unconcentrated.
5. నాస్తి నానాత్వసంజ్ఞా = He has no perception of difference.

6. నాస్త్యప్రతిసంఖ్యాయోపేక్షా = His even mindedness is not due to lack of consideration.
7. నాస్తి ఛందపరిహాణిః =His zeal never fails
8. నాస్తి వీర్యపరిహాణి: =His vigour never fails.
9. నాస్తి స్మృతిపరిహాణిః =His mindfulness never fail.
10. నాస్తి సమాధిపరిహాణిః =His concentration never fails.
11. నాస్తి ప్రజ్ఞాపరిహాణిః = His wisdom never fails.
12. నాస్తి విముక్తిపరిహాణిః = His deliverance never fails.
13. సర్వకాయకర్మజ్ఞానపూర్వంగమజ్ఞానానుపరివృత్తిః = All the deeds of his body are preceded by cognition, and continue to conform to cognition
14. సర్వవాక్కర్మజ్ఞానపూర్వంగమజ్ఞానానుపరివృత్తిః = All the deeds of his voice are preceded by cognition, and continue to conform to cognition
15. సర్వమనస్కర్మజ్ఞానపూర్వంగమజ్ఞానానుపరివృత్తిః = All the deeds of his mind are preceded by cognition and continue to conform to cognition.
16. అతీతేऽద్వన్యసంగమప్రతిహతజ్ఞానదర్శనమ్ = His cognition and wisdom regarding the past period of time proceeds unobstructed and freely.
17. అనాగతేऽధ్వన్యసంగమప్రతిహతజ్ఞానదర్శనమ్ = His cognition and vision regarding the future period of time proceeds unobstructed and freely.
18. ప్రత్యుత్పన్నేऽధ్వన్యసంగమప్రతిహతజ్ఞానదర్శనం = His cognition and vision regarding the prasent period of time proceeds unabstructed and freely.

దశబలములు (Ten powers of the Tathagata)

1. స్థానాస్థానబలమ్ = He knows as it really is, what can be as what can be, and what cannot be as what cannot be.

2. కర్మవిపాకజ్ఞానబలమ్ = He knows, as they really are, the karmic results of past, future and present actions and undertakings of actins, as to place and cause.
3. నానాధాతుజ్ఞానబలమ్ = He knows, as they really are, the various elements in the world.
4. నానాధిముక్తిజ్ఞానబలమ్ = He knows, as they really are, the various dispositions of other beings and persons.
5. సత్త్వేంద్రియపరాపరజ్ఞానబలమ్ = He knows, as they really are, the higher and lower faculties of other beings and persons.
6. సర్వత్రగామినీప్రతిపత్తిజ్ఞానబలమ్ = He knows, as it really is the way that leads everywhere.
7. ధ్యానవిమోక్షసమాధిసమాపత్తిసంక్లేశవ్యవదానవ్యుత్థానజ్ఞానబలమ్ = He knows, as they really are, the defilement and purification of all trances, deliverances, concentrations and meditational attainments, as well as the emergence from them.
8. పూర్వనివాసానుస్మృతిజ్ఞానబలమ్ = He recollects his various previous lives.
9. చ్యుత్యుత్పత్తిజ్ఞానబలమ్ = He knows the disease and rebirth of beings as it really is.
10. ఆస్రవక్షయజ్ఞానబలమ్ = Through the extinction of the outflows, he dwells in the attainment of that emancipation of his heart and wisdom, which is without outflows, and which he has, in this very life well known and realized by himself. He knows "Birth is exhausted for me, the higher spiritual life has been lived. I have done what had to be done. After this becoming there will be none further".

వైశారద్యములు (four grounds of self–confidence of the Tathagata)

1. సర్వధర్మాభిసంబోధివైశారద్యం = The confidence that he is fully enlightened about all natures.
2. సర్వ ఆసవక్షయజ్ఞానవైశారద్యం = The confidence in knowing the destruction of all defiling fluxes.
3. అంతరాయికధర్మానన్యథాత్వనిశ్చితవ్యాకరణవైశారద్యం = The confidence that he explains exactly and definitely the obstructive conditions (క్లేశములు).
4. నైర్యాణికప్రతిపద్వ్యాకరణవైశారద్యమ్ = The confidence in the correctness of his path of salvation for realizing all success.

Note:- వజ్రచ్ఛేదికలో 'ఎందులకనగా, కనుక' లాంటి పదాలు హేతుసంబంధ పదాలుగా (logical connection) భావించరాదు. తర్కాన్ని పూర్తిగా అలక్ష్యం చేస్తున్న విధంగా వాక్యాలుంటాయి. తర్కానికి మూలస్తంభాలలాంటి మూడు నియమాలున్నాయి.

1. Law of identity: A is A 2. Law of contradiction: A cannot be both B and not B. 3. Law of excluded middle: a thing must be either B or not B.

ఈ తార్కిక నియమాలు ఏవీ వజ్రచ్ఛేదిక తలదాల్చదు. అధ్యాత్మికంగా చూస్తే తర్కం యొక్క ఉపయోగం ప్రథమ సోపానంలోనే. ఆపైన అధిరోహించవలసిన మెట్లు ఎన్నో ఉన్నాయి.



# 9. అరణావిహారి (dweller in peace)

అవతారిక:- ఆర్యాధ్యాయితముష్టిసూత్రం నుండి కొంతభాగం అవతారికగా సరిపోతుంది.

మంజుశ్రీ :- భగవాన్, నాలుగు ఆర్యసత్యములను ఎటుల చూడవలెను?

భగవానుడు:- సర్వధర్మములను అనుత్పన్నములుగా (unoriginated) ఎవడు తెలుసుకొనెనో అతడు దుఃఖ సత్యమును తెలిసినవాడు. సర్వధర్మములు అసముత్థితములుగా (unarisen) ఎవడు తెలుసుకొనెనో అతడు సముదయమును (cause of misery) వదిలించుకొనినవాడు. సర్వధర్మములు అత్యంత పరినిర్వృతములని (completely extinct) ఎవడు తెలుసుకొనెనో అతడు నిరోధ సత్యమును సాక్షాత్కరించుకొనినవాడు. సర్వధర్మములను ఎవడు అత్యంత శూన్యములుగా (completely empty) తెలుసుకొనెనో అతడు మార్గమును ధ్యానించినవాడు. ఈ విధముగా ఆర్యసత్యములను తెలిసినవాడు "ఇవి కుశల ధర్మములు, ఇవి అకుశల ధర్మములు, ఇవి వదిలించుకొనవలసియున్నవి, ఇవి సాక్షాత్కరించుకొనవలసియున్నవి, దుఃఖమును తెలుసుకొనవలెను, కారణమును వదిలించుకొనవలెను, నిరోధమును సాక్షాత్కరించుకొనవలెను, మార్గమును భావన (meditation) చేయవలెను" అని వివిధ వికల్పములకు (thoughts) లోనుగాడు. బాలపృథక్‌జనులే కల్పనలు చేసుకొని రాగ ద్వేష మోహాలను ఉత్పత్తి చేసుకొనుదురు. ఆర్యులు సమారోపమూ (adding) చేయరు, అపవాదమూ (removing) చేయరు. మొత్తం త్రైధాతుకాన్ని (triple universe) అజాతంగా (unoriginated), ఒక మాయగా, ఒక స్వప్నంగా, ఒక ప్రతిశబ్దంగా (echo) చూచెదరు.

అనువాదం

భగవానుడు:- సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? స్రోతఆపన్నుడు (stream winner) "నేను స్రోతఆపత్తి ఫలమును (fruit of a stream winner) పొందితిని" అనుకొనునా?

*సుభూతి:–* అనుకొనడు. 'స్రోత ఆపత్తి ఫలమును నేను పొందితిని' అని స్రోతఆపన్నుడు అనుకొనడు. ఎందులకనగా, అతడు (స్రోతము అనెడి) ఏ ధర్మమునూ పొందలేదు. కనుకనే స్రోతఆపన్నుడని చెప్పబడుచున్నాడు. రూపములను (sight–objects) పొందలేదు, శబ్దములను పొందలేదు, గంధములను పొందలేదు, రసములను పొందలేదు, స్ప్రష్టవ్యములను పొందలేదు, ధర్మములను (objects of mind) పొందలేదు. కనుకనే స్రోతఆపన్నుడనబడుచున్నాడు. భగవాన్, ఒకవేళ అతనికి "నేను స్రోత ఆపత్తి ఫలమును పొందినాను" అను భావన కలిగినచో అదియే అతనిలో ఆత్మగ్రాహముగా (seizing on a self) అయిపోవును. సత్త్వగ్రాహముగా జీవగ్రాహముగా పుద్గలగ్రాహముగా అయిపోవును.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? సకృదాగామి (once–Returner), "నేను సకృదాగామి ఫలమును పొందితిని" అనుకొనునా?

*సుభూతి:* అనుకొనడు. సకృదాగామిత్వమును పొందిన ధర్మము (a seperate entity) ఏదియూ లేదు. కనుకనే అతడు సకృదాగామి అనబడుచున్నాడు.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? అనాగామి (never–Returner) అయినవాడు "నేను అనాగామి ఫలమును పొందితిని" అనుకొనునా?

*సుభూతి:–* అనుకొనడు. "నేను అనాగామి ఫలమును పొందితిని" అని అనాగామి అనుకొనడు. ఎందులకనగా, అనాగామిత్వమును పొందెడి అనాగామి అనెడి ధర్మము (seperate entity) ఏదియూ లేదు. కనుకనే అతడు అనాగామి అనబడుచున్నాడు.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? అర్హతుడు (foe–destroyer = క్లేశములను సర్వనాశనం చేసినవాడు) "నేను అర్హత్వమును పొందితిని" అనుకొనునా?

*సుభూతి:–* అనుకొనడు. "నేను అర్హత్వమును పొందితిని" అని అనుకొనడు. ఎందులకనగా, అర్హతుడు అను ఒక ధర్మము (individual) లేదు కనుక. కనుకనే అతడు అర్హతుడు అనబడుచున్నాడు. ఒకవేళ అతనికి "నేను అర్హత్వముము పొందితిని"

అను (అహం) భావము కలిగినచో అదియే అతనికి ఆత్మగ్రాహముగా అయిపోవును. సత్త్వగ్రాహము, జీవగ్రాహము, పుద్గలగ్రాహము అయిపోవును. ఎందులకనగా, ఒకనాటి భిక్షు సమావేశములో తథాగతులవారు "అరణా విహారులలో అగ్రేసరుడు (foremost of those who dwell in peace) సుభూతి" అని నన్ను ప్రశంసించియున్నారు. భగవాన్, నేను అర్హతుడను, వీతరాగుడను, కానీ "అర్హతుడను, వీతరాగుడను" అని నేను అనుకొనడము లేదు. ఒకవేళ నాయందు " నేను అర్హత్వము పొందినవాడను" అనెడి భావము కలిగియుండిన పక్షములో భగవానులు నన్ను ఉద్దేశించి ఇట్లు చెప్పియుండరు: "కులపుత్రుడు సుభూతి అరణా విహారులలో అగ్రేసరుడు. అతడు ఎక్కడనూ విహరించడు (does not dwell any where) కనుకనే అరణావిహారి అరణావిహారి అని చెప్పబడుచున్నాడు."

Note:- రణము = యుద్ధము = strife, battle, conflict, fighting, quarrel. ఇది లేకపోవడం అరణం = peace, harmony, harmlessness, loving kindness.



# 10. క్షేత్ర వ్యూహములు (harmonies of Buddha fields)

*అవతారిక:-* ఎన్నో కల్పాలకు (aeons) పూర్వము దీపంకర బుద్ధుని శాసనకాలములో సుమేధుడనే యువకుడు దీపంకరుణ్ణి చూసి భక్తిపరవశ చిత్తంతో ఆయన్ను ఐదు పుష్పాలతో పూజించి బోధిచిత్తమును (altruistic mind) స్వీకరించినాడు. అప్పుడు దీపంకర తథాగతుడు సుమేధుణ్ణి ఆశీర్వదిస్తూ "భవిష్యత్తులో నీవు బుద్ధత్వాన్ని నిశ్చయంగా పొందుతావు" అని దీవించాడు.

కూపస్థ మండూకములలాగా ఆలోచించడం అధ్యాత్మికంగా మంచిది కాదు. లెక్కించడానికి వీలు కానన్ని లోకధాతువులు (universes) ఉన్నాయి. ఆయా లోకధాతువులకు ఆయా కల్పాల్లో వేరు వేరుగా బుద్ధులున్నారు. ఈ 'సహా'లోక ధాతువుకు ఈ భద్రకల్పంలో బుద్ధుడుగా శాక్యముని అవతరించాడు. "వైరోచనరశ్మిప్రతిమండితం" అనే ఒక లోకధాతువు (universe) ఉన్నది. ఇప్పుడు అక్కడ బుద్ధుడుగా ఎవరున్నారనేది తెలియదు కానీ 'ప్రియదర్శన' కల్ప కాలంలో అక్కడ "జలధరగర్జితఘోషసుస్వరనక్షత్రరాజసంకుసుమితాభిజ్ఞుడు" అనే పేరు కలిగిన తథాగతుడు బుద్ధుడుగా ఉండినాడు. లోకధాతువులు (universes) ఎన్ని ఉన్నాయో చెప్పడం అసాధ్యం. ఒక ఊహా చిత్రం ద్వారా చూస్తాము. ఈ సహాలోకధాతువును మొత్తాన్ని అణువులుగా విడగొట్టి ఆ అణువులను లోకధాతువుల గణన కోసం ఒక్కొక్క అణువును. ఒక్కొక్క లోకధాతువులో వేసుకొంటూ పోతే అణువులయిపోతాయి గానీ లోకధాతువుల గణన అసంపూర్ణంగానే ఉండిపోతుంది.

ఒక బుద్ధుడి ప్రభావం ఒక లోకధాతువు వరకే. ఈ పరిమితికి బుద్ధక్షేత్రం (field of Buddha's spiritual influence) అని పేరు. లెక్కబెట్టడానికి వీలుకానన్ని కల్పాలకు (aeons) పూర్వం లోకేశ్వరరాజ తథాగతుని శాసన కాలములో ధర్మాకరుడు అనే

యువకుడు నలుభైఎనిమిది ప్రణిధులు (vows) చెప్పి బోధిచిత్తాన్ని స్వీకరిస్తాడు. ఆ 48 ప్రణిధుల సారాంశం ఏమిటంటే అత్యంత శ్రేష్ఠమైన బుద్ధక్షేత్రాన్ని (universe) తాను నిర్మించగలిగినపుడే బుద్ధత్వాన్ని పొందుతానని. ఆ ధర్మాకరుడే నేడు భక్తులందరూ ప్రార్థించే అమితాభ బుద్ధుడుగా (Buddha of immeasurable light) అయ్యాడు. ఈయన నిర్మించిన క్షేత్రం (universe) పేరు సుఖావతీవ్యూహం.

"ఓం నమో అమితాభాయ బుద్ధాయ" అని ఒక్కసారి స్మరించినా చాలు జీవులు మరణానంతరం సుఖావతీ వ్యూహం చేరుతారు. అసలు స్మరించను కూడా అవసరం లేదు. అపార కరుణతో అమితాభుడే స్వయంగా మరణించిన జీవులను అందరినీ తన లోకానికి చేరవేస్తాడు!

Note:- అధ్యాత్మకంగా రెండు ధోరణులున్నాయి. 1. స్వీయశక్తి (self-power), 2. పరశక్తి (other-power). శ్రావకయానానిది స్వీయశక్తి పోకడ. దీనికి పూర్తి భిన్నంగా పరశక్తి పోకడను మహాయాన సూత్రాల్లో కొన్ని సూత్రాలు ప్రచారం చేశాయి. ఉదా|| సుఖావతీ వ్యూహ సూత్రం (Array of Happy Land Sutra). ముక్తి విషయాన్ని అమితాభబుద్ధుడికి వదలివేసి దైనందిన జీవితాన్ని చక్కదిద్దుకొనేందుకు శక్తిసామర్థ్యాలను వినియోగించడం మంచిది అనే భక్తిధోరణియే, శరణాగతి ధోరణియే అమితాభ భక్తి సంప్రదాయం (pure Land School). అమితాభ బుద్ధుణ్ణి నమ్మి శరణు పొందినవాడు యథేచ్ఛాజీవిగా జీవించడు. సాధ్యమైన మేరకు పంచశీల వగైరా నియమాలను పాటిస్తూ మామూలు జీవితాన్ని జీవిస్తాడు. మరణానంతర విషయాన్ని మాత్రం అమితాభునికి వదలివేస్తాడు.

వ్యూహం అంటే orderly arrangement. మనకు ఈ లోకం ఒక వ్యూహంగా కనిపించడం లేదు. అంతా disorderly గానూ turbulent గానూ కనిపిస్తున్నది. విమలకీర్తి నిర్దేశ సూత్రంలో "ఈలోకం నీకు ఎలా కనిపిస్తున్నది?" అని విమలకీర్తి శారిపుత్రుణ్ణి ప్రశ్నించగా "మహాదరిద్రంగా కనిపిస్తున్నది" అంటాడు శారిపుత్రుడు. అదే ప్రశ్నకు మంజుశ్రీ "పరమ రమణీయంగా కనిపిస్తున్నది" అంటాడు. కనుక లోకం అనేది neutral. వ్యూహంగా కనిపించడం, అవ్యూహంగా కనిపించడము చిత్తము మీద ఆధారపడియున్నది.

అనువాదం

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? దీపంకర తథాగతుని నుండి ఈ తథాగతుడు గ్రహించిన ధర్మము ఏదైనా ఉన్నదా?

*సుభూతి:–* లేదు భగవాన్. దీపంకర తథాగతుని నుండి తథాగతులవారు గ్రహించిన ధర్మము ఏదియూ లేదు.

*భగవానుడు:–* ఏ బోధిసత్త్వుడయిననూ "నేను క్షేత్ర వ్యూహములను (harmonious Buddha fields) నిష్పాందించెదను (create)" అని ప్రణిధి చెప్పినచో అతడు వితథము (false) చెప్పినవాడే అగును. ఎందులకనగా, క్షేత్రవ్యూహములు క్షేత్రవ్యూహములు అని తథాగతుడు అవ్యూహములనే (no–harmonies) చెప్పినాడు. కనుకనే అవి క్షేత్రవ్యూహములనబడుచున్నవి. కనుక సుభూతీ, మహాసత్త్వుడయిన బోధిసత్త్వుడు ఈ విధముగా అప్రతిష్ఠిత (not settling, not anchoring, not abiding, not leaning, not clinging) చిత్తమును కలిగియుండవలెను. దేనియందును చిత్తమును తగుల్కొననీయరాదు. రూపములయందు శబ్దములయందు గంధములయందు రసములయందు స్ప్రష్టవ్యముల యందు ధర్మములయందు (mind–objects) చిత్తమును తగుల్కొననీయరాదు.

సుభూతీ, ఒకానొక పురుషుడు ఆత్మభావమును (body) ఒక మహాకాయముగా (a huge body) మేరు పర్వతము అంత (ఐదులక్షలమైళ్ల పొడవు, ఐదులక్షలమైళ్ల వెడల్పు) పెద్దదిగా కలిగియున్నాడనుకొనుము. నీవేమనుకొనుచున్నావు? అది పెద్దదియేనా?

*సుభూతి:–* చాలా పెద్దది సుగతా, చాలా పెద్దదియే ఆ ఆత్మభావము (body / personal existence). ఎందులకనగా, ఆత్మభావము ఆత్మభావము అని తథాగతులవారు చెప్పనది అభావమునే (no–existence). కనుకనే అది ఆత్మభావము అనబడుచున్నది. భగవాన్, అది భావమూ కాదు, అభావమూ కాదు. కనుకనే ఆత్మభావము అనబడుచున్నది.

Note:-భావము, సత్ పర్యాయపదాలు. ఇంగ్లీషులో existents. సత్‌కి నిర్వచనం (definition) చెప్పాలంటే అర్థక్రియా కారిత్వం (capable of performing the funtion of creating effects, సరళంగా చెప్పాలంటే functioning thing) అని చెప్పాలి. కదలక మెదలక ఉండే గుండ్రాయి కూడా functioning thing. అందులో ఏమి activity జరుగుతున్నదో వైజ్ఞానికులను అడిగితే చెబుతారు. గుండ్రాయి ఎట్టగా లేదా మరో రంగులో కనిపిస్తుందంటేనే అక్కడ activity ఉందని తెలుసుకోవచ్చు. కాంతి కిరణాలలోని తక్కిన రంగులను మింగివేసి ఏదో ఒక రంగునే బయటకు కక్కుతూ ఉండడం activity కాదా?

భావములన్నీ అనిత్యములు అంటే క్షణక్షణమూ మార్పునకు లోనవుతూ ఉంటాయి. అనిత్యమంటే ఇదియే అర్థం. శాస్త్రజ్ఞులను అడిగితే రెండు గుండ్రాళ్ల మధ్య వయస్సులో తేడాలు కూడా చెబుతారు! అనిత్యం కానట్టి భావం లేదు, క్షణక్షణమూ మార్పునకు లోను కానివాటిని నిత్యం అంటారు. క్షణక్షణం మార్పునకు లోను కానివి అభావములు మాత్రమే (non–existents). ఇవి అర్థక్రియా రహితములు (non–functioning). మాంధాత కాలంలో ఆకాశం (space) ఎలా ఉందో అలానే ఇప్పుడూ ఉన్నది. ఎప్పుడూ అలానే ఉంటుంది. అభావం కనుక దానికి ఉత్పత్తి స్థితి లయములు లేవు. అభావం కనుక క్షణక్షణం మారిపోవడమూ ఉండదు. ఘటభావం (presence of pot) యొక్క అనుభవం మనకున్నది. అది పగిలిపోతే లేదా ఎవరైనా తీసుకెళ్లిపోతే ఘటాభావం (absence of pot) అనుభవమూ మనకున్నది. భావం అభావం–ఈ రెండు అనుభవాలు కాకుండా వేరే అనుభవం మనకు లేదు. పరమార్థం అనేది భావానికి అభావానికీ అవతలది లేదా గంగా యమునలు త్రివేణి వద్ద ఏకం అయినట్లుగా పరమార్థంలో భావ అభావములు ఏకం అవుతాయి. మేరు పర్వతం అంతటి మహాకాయమైనా ఆవగింజ అంతటి అల్పకాయమైనా పరమార్థదృష్టికి సమములే. రెండూ స్వభావ శూన్యములు (own–being లేనట్టివి). కనుక భావము కాదు అభావమూ కాదు.

# 11. గంగానది ఇసుక రేణువులు

*అవతారిక:- గంగోత్రిలో ఉద్భవించి గంగానది, కొండలలో అడవులలో మైదానాలలో ఎన్నో వంకరటింకరలు పోతూ చివరకు గంగాసాగరం వద్ద సముద్రుణ్ణి కలుస్తుంది. ఇన్ని వందల మైళ్ల జలప్రవాహం కలిగిన గంగానదికి ఇవతలి తీరం అవతలి తీరం ఉన్నాయి. ఈ రెండు తీరాల పొడుగునా ఇసుక ఉంటుంది. ఈ ఇసుక రేణువులు మొత్తం ఎన్ని ఉంటాయో ఊహించండి. అంత సంఖ్యలో మళ్లీ అన్ని గంగానదులను ఊహించండి. ఆ అన్ని గంగానదుల ఇసుక రేణువులు ఎన్ని ఉంటాయో ఊహించండి. బౌద్ధంలో ఇలాంటి పరికల్పములు (imageries) చాలా ఉన్నాయి. ఇక, 8వ అధ్యాయానికి ఇచ్చిన అవతారికను ఇక్కడికి కూడా అన్వయించుకొనగలరు.*

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, గంగానది ఇసుక రేణువులు ఎన్ని ఉన్నవియో అన్ని గంగానదుల మొత్తము ఇసుక రేణువుల సంఖ్య బహుళమేనా?

*సుభూతి:-* నదుల సంఖ్యయే బహుళముగా ఉన్నది భగవాన్. ఇక వాటి ఇసుకరేణువుల గురించి చెప్పవలెనా?

*భగవానుడు:-*సుభూతీ, నేను నీకు ఒక ప్రకటన చేయుచున్నాను. ఒక విషయమును తెలుపుచున్నాను. వినుము. ఆ గంగానదుల ఇసుక రేణువులు ఎన్ని ఉన్నవియో అన్ని లోకధాతువులను సప్తరత్నములతో నింపి ఏ స్త్రీగానీ పురుషుడుగానీ తథాగతులకు దానము చేసినచో దాని వలన ఆ స్త్రీకిగానీ ఆ పురుషునికిగానీ లభించెడి పుణ్యస్కంధము (రాశి)బహుళమేనా?

*సుభూతి:-* బహుళమే భగవాన్

*భగవాన్:-* ఏ కులపుత్రుడుగానీ ఏ కులదుహితగానీ ఈ ధర్మ పర్యాయమునుండి (discourse on dharma) కనీసము నాలుగు పాదములయిననూ గ్రహించి ఇతరులకు తెలియజెప్పునో ప్రకాశపరచునో అట్టి వ్యక్తి పొందెడి పుణ్యస్కంధము పైన తెలిపిన పుణ్యస్కంధముకన్ననూ ఎంతో ఎక్కువగా ఉండును. అప్రమేయముగా (immeasurable) అసంఖ్యేయముగా (incalculable) ఉండును.



# 12. చైత్యం (object of worship / veneration)

*అవతారిక:-* అంతర్జాతీయ విపశ్యన అధ్యక్షులు గోయంకాగారు ధ్యానానికి చాలా ముఖ్యత్వాన్ని ఇస్తారు. పాండిత్యం (scholarship) పట్ల ఆయనకు విముఖత. 'బుద్ధివిలాస్' (show of intellect or conceit of intellect) అని నిరసిస్తారు. ఆయన కూడా ప్రచురణ కార్యక్రమం చేపట్టి పాళీ సూత్రపిటకం మొత్తాన్ని దేవనాగరిలిపిలో యాభై సంపుటాలుగా వెలువరించారు. సూత్రపిటక అధ్యయనం ధ్యానానికి సహాయకారిగా ఉంటుందేగాని విక్షేపకారి కాదని ఆయన భావించియుండవచ్చును. సూత్రపిటకమే యాభై సంపుటాలుగా ఉంటే (ఒక్కొక్కటి సగటున 500 పేజీలు)మొత్తం త్రిపిటకాలు ఎంత ఉంటుందో ఊహించుకోండి. ఇంత సాహిత్యమూ సుమారు 400 ఏండ్లు లిపిబద్ధం కాకుండా మౌఖికంగానే ఒక తరం నుండి ఒక తరానికి అందుతూ వచ్చింది. క్రీ.పూ. తొలి శతాబ్దంలో పాళీ త్రిపిటకాలు తొలిసారిగా సింహళదేశంలో లిపిబద్ధమైనాయి. సూత్రగ్రంథాలను పెన్నిధిగా భావించినందువల్లనే ఆనాటి వాళ్లు వాటిని నిలబెట్టుకొనేందుకు ఎంతో శక్తిని వెచ్చించారు. తరువాతి కాలంలో సూత్రగ్రంథాలను స్తూపంలో నిక్షిప్తం చేసి ఆ స్తూపాన్ని ధర్మకాయంగా భావించి పూజించడం జరిగింది. స్తూపాలు రెండు రకాలు. బుద్ధుని భౌతిక అవశేషాల మీద నిర్మించినవి ఒక రకం. బుద్ధుని ఉపదేశ గ్రంథాల మీద నిర్మించినవి రెండవ రకం. 19వ శతాబ్దిలో ఈ రెండవ రకం స్తూపశిథిలాల నుండియే బౌద్ధగ్రంథాలు కొన్ని లభ్యమైనాయి. నేపాళదేశం బౌద్ధులు తొమ్మిది మహాయాన సూత్ర గ్రంథాలను పూజిస్తూ వచ్చారు. కనుక అవి అక్కడ సంపూర్ణంగా లభ్యమైనాయి. ఈ వజ్రచ్ఛేదిక సంస్కృత మూల గ్రంథం లభించినది భారతదేశంలో కాదు. జపాన్‌లోని ఒక బౌద్ధమందిరంలో. సంస్కృతం చదివేవాళ్లు జపానులో ఉండినందువల్ల కాదు ఆ గ్రంథం అక్కడికి చేరింది. ఒక చైత్యంగా (object of worship) అక్కడికి చేరి నేడు మన చేతికి లభ్యమయ్యింది.

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, ఏ పృథివీ ప్రదేశంలో ఈ ధర్మ పర్యాయమునుండి (discourse on dharma) కనీసము నాలుగు పాదముల నైననూ గ్రహించి పలుకడము జరుగునో ప్రకాశపరచడము జరుగునో అట్టి పృథివీ ప్రదేశము దేవతలకు మనుష్యులకు అసురులకు (demi–gods) చైత్యముగా (shrine) మారిపోవును. ఇక మొత్తము ధర్మపర్యాయమును ధారణ చేయడము, పలుకడము (recite), అధ్యయనము (study) చేయడము, ఇతరులకు వివరముగా తెలియజెప్పడము ఎవరు చేయుదురో వారికి కలిగెడు మహాత్త్వమును గురించి వేరుగా చెప్పడము ఎందులకు? వారు పరమాశ్చర్య వ్యక్తులగుదురు! (most wonderfully blest). ఆ పృథివీ ప్రదేశములో శాస్తగానీ (బుద్ధుడు) శాస్త్రప్రతినిధి వంటివాడు గానీ (sage) విహరించును.

Note:- "Chaitya is the most general name for any sanctuary, and it may refer to a stupa, a vihara, an assembly hall, a tree, a memorial stone, a holy relic or object, or even an image. A shrine is a sacred place set apart, and it should be honoured with gifts of flowers, and so on. In past ages these shrines were something to reakcon with. Respect for them assured the prosperity of nations and they were inviolate sanctuaries for people in fear for their lives."

B.C.Law.

Note:- ఈ వజ్రచ్ఛేదిక వాక్యాలకు సమానాంతరంగా ఉన్నట్టి అష్టసాహస్రిక వాక్యాలు:

కులపుత్రుడుగానీ కులదుహితగానీ ఏ ప్రదేశములో ఈ ప్రజ్ఞాపారమితను గ్రహించునో ధారణచేయునో పఠించునో ప్రవర్తింపజేయునో (spreads), దేశనము చేయునో (demonstrates), ఉపదేశించునో (expounds), ఉద్దేశించునో (explains), స్వాధ్యాయము చేయునో (repeats) అట్టి ప్రదేశములో- సత్త్వులు (beings) మనుష్యులచేగానీ అమనుష్యులచేగానీ (ghosts) బాధింపబడరు, ఆక్రమింపబడరు-పూర్వకర్మవిపాకమును మినహాయించి. ఎందులకనగా ఈ ప్రజ్ఞాపారమిత వలన

ఆ పృథివీప్రదేశము చైత్యము అగును. వందనీయము, మాననీయము, పూజనీయము, అర్చనీయము, అపచాయనీయము, సత్కరణీయము, గురుకరణీయము అగును. అక్కడికి ఏతెంచువారలకు ఆ ప్రదేశము త్రాణము (shelter), శరణము (refuge), లయనము (place of rest), పరాయణము (final relief) అగును.

Note:- ప్రజ్ఞాపారమిత సూత్రాలను పరిత్రాణములుగా (protection) పూర్వీకులు భావించారు. Hsuan–tsang (600–664) తన జీవితంలో ఎదురైన ఇక్కట్టులన్నిటినీ అధిగమించడానికి ప్రజ్ఞాపారమిత హృదయ సూత్రాన్ని (Heart Sutra) నమ్ముకొన్నాడు. నైరుతి చైనాలోని షుహ్ ప్రాంతంలో ఆయన నివసించినపుడు ఒళ్లంతా కురుపులతో బాధపడుచున్న ఒక వృద్ధుణ్ణి తన కుటీరానికి తీసుకువచ్చి ఆశ్రయం ఇచ్చి సపర్యలు చేసి అతనికి ఉపశమనం కలిగించాడు. ఆ వృద్ధుడు, Hsuan–tsang పట్ల కృతజ్ఞతను ప్రకటించి తన వద్ద ఉన్న ఒక చిన్న పుస్తకాన్ని కానుకగా ఇచ్చి సెలవు తీసుకొన్నాడు. ఆ చిన్న పుస్తకమే హృదయసూత్రం. దాన్ని పఠించగానే Husan–tsang జీవితం ఒక మలుపు తిరిగింది. భారతదేశానికి స్వయంగా వెళ్లి సూత్ర గ్రంథాలన్నిటినీ సేకరించి చైనాకు తీసుకరాదలచి ప్రయాణమయ్యాడు. భయంకరమైన ఒక ఎడారిలో ఒంటరిగా ప్రయాణిస్తుండగా వింత వింత ఆకారాలతో భీతిని కలిగించే భూతప్రేతపిశాచాలు Hsuan–tsangని చుట్టుముట్టాయి. మొదట ఆయన Kwan–yin నామమును స్మరించాడు. ప్రయోజనం కనిపించలేదు. ఆ పైన హృదయ సూత్రాన్ని పఠించడం మొదలు పెట్టాడు. హృదయ సూత్ర పదాల ధ్వని ఆయన కంఠం నుండి వెలువడగానే తక్షణమే భూతప్రేతపిశాచాలు మాయమయ్యాయి.





# 13. ప్రజ్ఞాపారమిత (transcendent wisdom)

*అవతారిక:- ఇక 29వ అధ్యాయం వరకు పునరుక్తులే (repetitions) దర్శనం ఇస్తాయి. ఓషోగారి Diamond Sutra లో ఈ భాగం ఉండదు. Edward Conze గారు ఈ భాగానికి ఎలాంటి వివరణలు ఇవ్వకుండా కేవలం అనువాదం వరకు చేశారు.*

పారమిత అంటే perfection, best, superlative, transcendent అనే అర్థాలున్నాయి. మరొక అర్థం gone over to the other shore. ప్రజ్ఞాపారమిత సూత్రాలు పెద్దవి చిన్నవి మధ్యరకానివి చాలా ఉన్నాయి. (సుమారు 40). అందులో వజ్రచ్ఛేదిక ఒకటి. వజ్రచ్ఛేదిక సహాయంతో సత్కాయదృష్టిని (individuality view = మోహం) రూపుమాపగలిగితే ఆపైన మనలో ఉండే రాగం భక్తిగా మారుతుంది. ద్వేషం కరుణగా మారుతుంది. గంధర్వలోకంలో భద్రపరుపబడియున్న ఒక కోటి శ్లోకాల ప్రజ్ఞాపారమిత సూత్రాలు, దేవలోకంలో భద్రపరుపబడియున్న పదిలక్షల శ్లోకాల ప్రజ్ఞాపారమిత సూత్రాలు, నాగలోకం నుండి నాగార్జునుడు వెలికి తెచ్చిన లక్షశ్లోకాల ప్రజ్ఞాపారమిత సూత్రాలు ఈ అన్ని సూత్రాల సారాన్ని రెండు పదాల్లో చెప్పవలసి వస్తే కరుణ, ప్రజ్ఞ అని చెప్పవలసివస్తుంది. మొత్తం బుద్ధుని ఉపదేశాలు ఈ రెండు పదాల్లో ఇముడుతాయి.

Note:- 32 భాగాల విభజన మూలగ్రంథంలో లేదు. దీనిని తొలుతగా చైనా భాషలోకి అనువదించిన కుమారజీవుడు 32 భాగాలుగా విభజించినాడు. కుమారజీవుడు క్రీ.శ 4వ శతాబ్దంలో జీవించాడు. ఆనాడు చైనాలో most wanted personగా (మంచి అర్థంలో) వెలుగొందినాడు. తమ దేశంలోనే కుమారజీవుణ్ణి నిలిపి ఉంచడం కోసం ఆనాటి ప్రభుత్వం ఈయనను జీవితాంతం బంధీగానే ఉంచింది (of course with all the royal paraphernalia). ఈ పుస్తకంలోని అధ్యాయాల పేర్లు కుమారజీవుడు ఇచ్చినవి కావు.

## అనువాదం

*సుభూతి:–* భగవాన్, ఈ ధర్మపర్యాయమునకు (discourse on dharma) పేరు ఏమి? దీనిని నేనెట్లు మనస్సులో నిలుపుకొనవలెను?

*భగవానుడు:–* ఈ ధర్మపర్యాయమునకు పేరు ప్రజ్ఞాపారమిత. ప్రజ్ఞాపారమితగానే నీవు దీనిని మనస్సులో నిలుపుకొనుము. ఎందులకనగా, ప్రజ్ఞాపారమితయని తథాగతుడు అపారమితనే (not gone beyond) భాషించినాడు. కనుకనే ప్రజ్ఞాపారమిత యనబడుచున్నది. సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతుడు భాషించిన ధర్మము ఏదియైననూ ఉన్నదా?

*సుభూతి:–* లేదు భగవాన్. తథాగతుడు భాషించిన ధర్మము ఏదియూ లేదు.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువులో (Great Trichiliocosm = a universe which comprises 1,000 million suns, 1,000 million moons, 1000 million heavens and hells etc) ఉన్నట్టి పృథివీరజస్సు (particles of dust) బహుళమేనా?

*సుభూతి:–* బహుళమే భగవాన్. బహుళమే సుగతా! ఎందులకనగా, తథాగతులవారు పృథివీరజస్సు అని అరజస్సునే (no–particles) భాషించినారు. కనుకనే అది పృథివీరజస్సు అనబడుచున్నది. మరియూ ఈ లోకధాతువు అని అధాతువునే (no–world system) తథాగతులవారు భాషించినారు. కనుకనే ఇది లోకధాతువు అనబడుచున్నది.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? అర్హతుడు సమ్యక్ సంబుద్ధుడు అయిన తథాగతుడిని ముప్పైరెండు మహాపురుష లక్షణములు కలవానిగా చూడవలెనా?

*సుభూతి:–* చూడరాదు భగవాన్. ముప్పైరెండు మహాపురుష లక్షణములతో లక్షితుడుగా తథాగతులవారు చూడబడరాదు. ఎందులకనగా, ఏ ముప్పైరెండు మహాపురుష లక్షణములు తథాగతులవారు భాషించినారో అవి అలక్షణములుగానే (no–marks) భాషించినారు. కనుకనే అవి ముప్పైరెండు మహాపురుషలక్షణములు అనబడుచున్నవి.

*భగవానుడు:–* సుభూతీ, ఎవరయిననూ స్త్రీగానీ పురుషుడుగానీ ప్రతిదినమూ గంగానదీ ఇసుకరేణువుల సంఖ్యకు సమాన సంఖ్యలో ఆత్మభావములను (belongings) పరిత్యజించెదరనుకొనుము. ఆ విధముగా పరిత్యజించుచు గంగానది ఇసుకరేణువుల సంఖ్యకు సమానసంఖ్య కల్పముల (aeons) కాలము పరిత్యాగ జీవితములను జీవించెదరనుకొనుము. ఎవరయితే ఈ ధర్మపర్యాయమునుండి కనీసము నాలుగు పాదములయిననూ గ్రహించి ఇతరులకు తెలియజెప్పుదురో ప్రకాశపరచుదురో అట్టివారు పైన చెప్పబడిన వ్యక్తుల కంటే చాలా ఎక్కువ పుణ్యస్కంధమును – అప్రమేయము (immeasurable) అసంఖ్యేయము (incalculable) అయిన పుణ్యస్కంధమును గడింతురు.



# 14. క్షాంతిపారమిత

*అవతారిక:- ధర్మభ్రష్టత (decline of Dharma) గురించి మళ్లీ ప్రస్తావన. మొదటి ఐదువందల ఏండ్లు అర్హతులకు కొరత ఉండదు. ఆ తరువాత ఐదువందల ఏండ్లకు అర్హతులు కనిపించడం అరుదై పోతుంది కానీ ధ్యానులు కనిపిస్తారు. ఆపైన ఐదువందల ఏండ్లు అర్హతులు, ధ్యానులు కరువవుతారు. పండితులు (scholars) ఉంటారు. ఆ తరువాత ఐదువందల ఏండ్లలో అర్హతులూ ధ్యానులూ పండితులూ ఎవరూ కనిపించరు. కట్టడాలు కట్టేవాళ్లు కనిపిస్తారు. ఆ తరువాత ఐదువందల ఏండ్లలో వాళ్లూ కనిపించరు. కిల్లికజ్జాలు పెట్టుకొని తగవులాడేవాళ్లే ఉంటారు-ఇలా ధర్మము క్రమంగా క్షీణిస్తూ బుద్ధశకం 2500 ఏండ్లకు అంటే 1956 నాటికి పూర్తిగా అంతరించిపోతుందని ఆనాటి ఒక నమ్మకం. సింహళదేశంలో ధర్మం బాగా వర్ధిల్లిన దినాల్లోని ఒక సంఘటన (historical fact). ఆ దేశాన్ని పాలించే రాజుకు ఒక తమ్ముడు. అతనికి ఒక అర్హతుణ్ణి సన్మానించి పూజించి గౌరవించి పుణ్యం సంపాయించాలనే ఉబలాటం కలిగింది. అభయగిరి విహారం మహాగిరి విహారం ఇంకా దేశంలోని అన్ని విహారాలూ వెళ్లి వెదకి చూశాడు. ఒక్కడూ కనిపించలేదు. అంతా మాటల పోగులే!*

*భారతదేశ చరిత్ర ఈ నమ్మకాన్ని నిజమని నిరూపించినా ఈ పతనం సార్వత్రికం కాదని చెప్పవచ్చు. భారతదేశం 12వ శతాబ్దం నుండి అంధకారయుగంలోకి అడుగుపెట్టింది. కానీ అదే సమయంలో టిబెట్టులో ధర్మకాంతులు దేదీప్యమానంగా వెలిగాయి. 14వ శతాబ్దంలో అక్కడ త్సాంగ్-క-బా (dzong-ka-ba) అనే మహోన్నత వ్యక్తి అవతరించాడు. ద్వితీయ బుద్ధుడనదగిన వ్యక్తి! ఈయన పేరును సంస్కృతీకరిస్తే మతిభద్రుడు అవుతుంది.*

### అనువాదం

ధర్మవేగం (impact of Dharma) సుభూతిని కదిలించి వేసింది. కన్నుల నుండి ఆనందబాష్పాలు (tears of joy) రాలినాయి. కన్నీళ్లను తుడుచుకొని "ఆశ్చర్యము భగవాన్, పరమాశ్చర్యము సుగతా, అగ్రయానికుల కొరకు శ్రేష్ఠయానికుల కొరకు తథాగతులవారు భాషించిన ఈ ధర్మపర్యాయము వలన నాలో జ్ఞానము ఉత్పన్నమయినది. ఇంతకు పూర్వము నేను ఇటువంటి ధర్మపర్యాయమును ఎప్పుడూ వినలేదు. ఈ సూత్రమును విని ఏ బోధిసత్త్వులు భూతసంజ్ఞను (true perception) కలిగించుకొనుదురో అట్టివారు అదృష్టవంతులే (most wonderfully blest) అగుదురు. ఎందులకనగా ఈ భూతసంజ్ఞ ఏదియో అది వాస్తవమునకు అభూతసంజ్ఞ. కనుకనే తథాగతులవారు భూతసంజ్ఞ భూతసంజ్ఞ అని పలుకుచున్నారు.

భగవాన్, ఈ ధర్మపర్యాయమును అంగీకరించడము స్వీకరించడము నాకు కష్టము కాదు. కానీ భవిష్యత్తులో రాబోవు కాలములో చివరిదైన ఐదవ ఐదువందల సంవత్సరముల కాలములో (1956) సద్ధర్మము లోపించిపోయిన ఆ కాలములో ఎవరయితే ఈ ధర్మపర్యాయమును గ్రహింతురో (take it up), ధారణ చేయుదురో (bear it in mind), వచింతురో (recite it), అధ్యయనము చేయుదురో (పర్యవాప్స్యంతి = study), ఇతరులకు వివరముగా తెలియజెప్పుదురో (illuminate it in full detail) వారు మిక్కిలి అదృష్టవంతులనియే (most wonderfully blest) చెప్పవలెను. భగవాన్, వారికి ఆత్మసంజ్ఞ (idea of self) కలుగదు. సత్త్వసంజ్ఞ (idea of a being), జీవసంజ్ఞ (idea of a soul), పుద్గలసంజ్ఞ (idea of a person) కలుగదు. వారికి సంజ్ఞయూ కలుగదు అసంజ్ఞయూ కలుగదు. ఎందులకనగా, ఏది ఆత్మసంజ్ఞయో అది అసంజ్ఞ (no perception). ఏది సత్త్వసంజ్ఞయో జీవసంజ్ఞయో పుద్గలసంజ్ఞయో అది అసంజ్ఞ. ఎందులకనగా, అన్ని సంజ్ఞలు వదిలించుకొనినవారు కదా తథాగతులు బుద్ధులు భగవంతులు.

*భగవానుడు:-* సుభూతీ, నీవు నిజమునే పలికితివి. రాబోవు కాలములో ఎవరయితే ఈ సూత్రమును విని భయపడరో భీతిచెందరో జడుసుకొనరో వారు పరమాశ్చర్య సమన్వాగతులు (most wonderfully blest). ఎందులకనగా తథాగతుడు చెప్పినది పరమపారమిత. అపారమిత కనుక పరమపారమిత. ఈ పరమపారమితనే అసంఖ్యాకమైన బుద్ధులు కూడా భాషింతురు. కనుకనే పరమ పారమిత (highest perfection) అనబడుచున్నది.

సుభూతీ, మరియూ తథాగతుని క్షాంతిపారమిత ఏదియో అది అపారమిత (no perfection). ఎందులకనగా, పూర్వము నేను క్షాంతివాదిగా ఉన్నప్పుడు కళింగరాజు నా అంగప్రత్యంగములను ఖండించినపుడు నాలో ఆత్మసంజ్ఞగానీ సత్త్వసంజ్ఞగానీ జీవసంజ్ఞగానీ పుద్గలసంజ్ఞగానీ ఏ సంజ్ఞగానీ అసంజ్ఞగానీ కలుగలేదు. ఎందులకనగా, ఆ సమయములో నాలో ఆత్మసంజ్ఞ తలెత్తియుండినచో వెనువెంటనే వ్యాపాదసంజ్ఞయూ (perception of ill-will) కలిగియుండెడిది. సత్త్వసంజ్ఞగానీ జీవసంజ్ఞగానీ పుద్గలసంజ్ఞగానీ తలెత్తియుండినచో వెనువెంటనే వ్యాపాదసంజ్ఞయూ కలిగియుండెడిది. ఎందులకనగా, గతించిన అసంఖ్యేయ కల్పములలో నేను ఐదువందలసార్లు క్షాంతివాది యనెడి ఋషిగా ఉండినాను. ఏ జన్మలోనూ నాలో ఆత్మసంజ్ఞ కలుగలేదు. సత్త్వసంజ్ఞ జీవసంజ్ఞ పుద్గలసంజ్ఞ కలుగలేదు. కనుక సుభూతీ, మహాసత్త్వుడయిన బోధిసత్త్వుడు అన్ని సంజ్ఞలను వదలివేసి అనుత్తర సమ్యక్ సంబోధియందు (utmost, right and perfect enlightenment) చిత్తము నుంచవలెను. చిత్తము రూప ప్రతిష్ఠితము కారాదు. శబ్ద గంధ రస స్ప్రష్టవ్య ప్రతిష్ఠితము కారాదు. ధర్మ (mind-objects) ప్రతిష్ఠితము కారాదు. ధర్మప్రతిష్ఠితమూ కారాదు. అధర్మ ప్రతిష్ఠితమూ కారాదు. దేనియందును ప్రతిష్ఠితము కారాదు. ఎందులకనగా, ఏది ప్రతిష్ఠితమో అది అప్రతిష్ఠితము (no-support). కనుకనే తథాగతుడు భాషించుచున్నాడు-"బోధిసత్త్వుడు అప్రతిష్ఠితుడై దానము చేయవలెను. రూప శబ్ద గంధ రస స్పర్శ ధర్మ ప్రతిష్ఠితుడై దానము చేయరాదు."

సుభూతీ, బోధిసత్త్వుడు అప్రతిష్ఠితుడై దానమును సర్వసత్త్వుల హితము కొరకు చేయవలెను. ఎందులకనగా, ఏది సత్త్వసంజ్ఞయో (perception of a being) అది అసత్త్వసంజ్ఞ. సర్వసత్త్వులు అని తథాగతుడు అసత్త్వులనే భాషించినాడు. ఎందులకనగా, సుభూతీ తథాగతుడు భూతవాది (speaks in accordance with reality), సత్యవాది, తథావాది (speaks of what is), అనన్యథావాది (యథార్థవాది). తథాగతుడు వితథవాది కాడు (does not speak falsely).

సుభూతీ, తథాగతుడు అభిసంబోధి (full knowledge) ద్వారా తెలుసుకొనినది బోధించినది, ధ్యానించినది అయిన ధర్మములో సత్యము లేదు, అబద్ధము లేదు. అంధకారములో ప్రవేశించిన మనుష్యుడు ఏదియూ చూడలేడు కదా! అటులనే వస్తుపతితుడయిన (fallen among things) బోధిసత్త్వుడునూ. వస్తుపతితుడై దానము చేయువాడునూ. సూర్యుడు ఉదయించి వెలుగు నిండినపుడు కన్నులు కలవాడు నానావిధములయిన రూపములను చూడగలుగును కదా! అటులనే వస్తుపతితుడు కానట్టి బోధిసత్త్వుడునూ. వస్తుపతితుడు కాకుండా దానము చేయువాడునూ.

మరియూ సుభూతీ, ఏ కులపుత్రుడుగానీ కులదుహితగానీ ఈ ధర్మపర్యాయమును గ్రహించునో, ధారణ చేయునో, వచించునో అధ్యయనము చేయునో ఇతరులకు వివరముగా తెలియజేయునో వారలందరిని తథాగతుడు బుద్ధజ్ఞానము చేత తెలుసుకొనినాడు, బుద్ధచక్షువు చేత చూచినాడు, వారలందరూ తథాగతునికి బాగుగా తెలియబడినారు. వారందరూ అప్రమేయమైన (immeasurable) అసంఖ్యేయమైన (incalculable) పుణ్యస్కంధమును గడించెదరు.

Note:- బౌద్ధపారిభాషిక పదాల అర్థాలను పాఠకుల స్వంతం చేయాలన్నది ఈ రచయిత అభిమతం. కానీ ఆ పని వాయిదా పడుతూ ఉన్నది. 'సంజ్ఞ' అనే పదం పాఠకులకు తరచు ఎదురయ్యింది. Buddhist Dictionary ఆ పదాన్ని వివరించిన తీరును కొంతవరకు ఇక్కడ ఎత్తి చూపుతాను.

సంజ్ఞ: Perception is one of the five groups of existence (స్కంధ) and one of the seven mental factors (చైతసిక) that are inseparably bound up with all

consciousness (చేతన). It is sixfold as perception of the of the five physical sense-objects and of mental objects. It is the awareness of an object's distinctive marks (one perceives blue, yellow etc). If in repeated perception of an object, these marks are recognized, సంజ్ఞ functions as memory.

సంజ్ఞ may also refer to ideas: నిత్య, అనిత్య, శుభ (pourity), అశుభ (impurity) etc.

మరింత స్పష్టత కోసం: సంజ్ఞాస్కంధ = perception (ఉద్గ్రహణ) of vatious characteristics (నిమిత్త) such as blue, yellow, long, short, male, female, agreeable, disagreeable, pleasant, unpleasant etc.

పరమార్థానికి (ultimate reality) అనిమిత్తం (signless, unrecognizable) అని కూడా పేరు. కనుక పరమార్థాన్ని నేను తెలుసుకొన్నాను అని ప్రకటించడం సాధ్యం కాదు!



# 15. సత్కాయదృష్టి వలదు

*అవతారిక:- మన దేహంలో జరిగే అత్యద్భుతమైన పనులు ఎన్నో ఉన్నాయి. ఇవి అహంకార నిరపేక్షంగా జరిగిపోతున్నాయి. ఈ మొత్తం పనితో పోల్చి చూస్తే మనం అహంకారంతో చేసే పని లక్షోవంతు కూడా ఉండదు. Volume of impersonal (ధర్మతా) work చాలా ఎక్కువ. Volume of personal work is almost insignificant. 'Know your body' లాంటి పుస్తకం ఏదో ఒకటి చదివినవాళ్లు అంగీకరించే సత్యమిది. బౌద్ధంలోని అనాత్మవాదం ఇదే. 'అహం' అనే functioning centre ని బౌద్ధం కాదనదు. పంచస్కంధాలు అనే పంచనదం ఉరవడిలో ఏర్పడిన చిన్న సుడిగుండం లాంటిది అది. అది ఎప్పుడూ impersonal (ధర్మతా) అనే త్రివిక్రమావతారం కాలికింద బలిచక్రవర్తిలా అణగి ఉండవలసిందే. దాన్ని బలూనులాగా ఉబ్బనీయకూడదు. ఉబ్బితే కష్టాలు తప్పవు. ఈ functioning centre (ప్రవృత్తికేంద్రం) సకల జీవరాశుల్లోనూ ఉంది. జీవి మనుగడకు ఇది అవసరం కనుకనే ఏర్పడింది. ఒక్క మానవుడిలోనే ఈ centre సత్కాయదృష్టి అనే బలూనుగా ఉబ్బిపోయింది. ఈ సత్కాయదృష్టిని ఆశ్రయించుకొని క్లేశాలు (afflictions) విజృంభిస్తుంటాయి. బౌద్ధం- అది శ్రావకయానంగానీ మహాయానంగానీ తంత్రయానంగానీ-ఉద్బోధించేది ఒకే ఒక విషయాన్నే. సత్కాయదృష్టి అనే ఇరవై తలల రావణాసురుణ్ణి వధించమని. వజ్రచ్ఛేదిక కూడా పేరా పేరాలో ఈ ఉద్బోధనమే చేస్తున్నది.*

*అనువాదం:*

*భగవానుడు:-* సుభూతీ, ఏ స్త్రీగానీ పురుషుడుగానీ గంగానది ఇసుకరేణువుల సంఖ్యకు సమాన సంఖ్యలో ఆత్మభావములను (belongings) ప్రొద్దునవేళ త్యాగము చేయుచు మరల మధ్యాహ్నవేళలోనూ గంగానది ఇసుక రేణువుల సంఖ్యకు సమాన సంఖ్యలో

ఆత్మభావములను త్యాగము చేయుచు మరల అదే సంఖ్యలో ఆత్మభావములను సాయంకాలమున త్యాగము చేయుచు ఈ విధముగా కల్పకోటినియుతశతసహస్ర సంవత్సరములు (many hundreds of thousands of millions of milliards of aeons) త్యాగమయ జీవితమును జీవించుచు గడించిన పుణ్యస్కంధము కంటెనూ చాలా ఎక్కువ పుణ్యస్కంధమును ఈ ధర్మపర్యాయమును వినినపుడు ఎవడయితే ప్రతిక్షేపించడో (not reject it) అట్టివాడు గడించును. ఆ పుణ్యము అప్రమేయము, అసంఖ్యేయము. ఇక దీనిని ఎవడయితే లిఖించునో గ్రహించునో ధారణ చేయునో వచించునో అధ్యయనము చేయునో ఇతరులకు తెలియజేయునో అట్టి వ్యక్తి గురించి ప్రత్యేకముగా చెప్పుట ఎందులకు?

సుభూతీ, ఈ ధర్మపర్యాయము అచింత్యము (unthinkable), అతుల్యము (incomparable). అగ్రయానికుల కొరకు శ్రేష్ఠయానికుల కొరకు తథాగతుడు ఈ ధర్మపర్యాయమును భాషించినాడు. ఎవరు దీనిని గ్రహింతురో ధారణ చేయుదురో వచియింతురో అధ్యయనము చేయుదురో ఇతరులకు తెలియజెప్పుదురో వారినందరిని తథాగతుడు బుద్ధజ్ఞానముచే తెలుసుకొనినాడు, బుద్ధచక్షువుచే చూచినాడు, వారినందరిని తథాగతుడు చక్కగా తెలుసుకొనినాడు. వారందరూ అప్రమేయమైన పుణ్యస్కంధమును కలిగినవారగుదురు. అచింత్యమయిన అతుల్యమయిన అమాప్యమయిన (measureless) అపరిణామమయిన (illimitable) పుణ్యస్కంధము కలవారగుదురు. వారందరూ బోధిని (enlightenment) సమానముగా పొందుదురు. ఎందులకనగా ఈ ధర్మపర్యాయమును హీనాధిముక్తులు (beings of inferior resolve) వినుటకు శక్తులు కారు. ఆత్మదృష్టికులు సత్త్వదృష్టికులు జీవదృష్టికులు పుద్గలదృష్టికులు వినుటకు శక్తులు కారు. బోధిసత్త్వప్రతిజ్ఞ లేనివారలు కూడా ఈ ధర్మపర్యాయమును వినుటకు గ్రహించుటకు ధారణ చేయుటకు వచించుటకు అధ్యయనము చేయుటకు శక్తులు కారు. అది అసంభవము.

మరియూ సుభూతీ, ఏ పృథివీ ప్రదేశములో ఈ సూత్రము ప్రకటమగునో అది పూజనీయ ప్రదేశమగును. దేవతలు మనుష్యులు అసురులతో కూడిన ఈ సమస్త లోకమునకు వందనీయము ప్రదక్షిణీయము అగును. ఆ పృథివీప్రదేశము చైత్యసమానమగును.

Note:- బలూనును ఆశ్రయించుకొని ఒకటికాదు రెండుకాదు మొత్తం 62 మిథ్యాదృష్టులు (false views) లోకంలో ఉన్నాయి. ఈ 62 మిథ్యాదృష్టులు ఏమిటో వివరంగా తెలుసుకోదలచినవారు దీర్ఘనికాయంలోని బ్రహ్మజాల సూత్రాన్ని చదవాలి. గడియారంలోని అవయవాలన్నీ కలిసి పని చేస్తుంటే టిక్‌టిక్ శబ్దం వెలువడుతుంది కదా! ఆ టిక్‌టిక్ లాంటిదే ఈ బలూను. ఇది ప్రతీత్యసముత్పన్నం (dependently originated) కనుక స్వభావశూన్యం (own–being లేనిది). టిక్‌టిక్ పోలిక ఓషోగారిది. ఈ టిక్‌టిక్‌కి పర్యాయపదాలు: ఆత్మ, సత్త్వ, జీవ, జంతు, పురుష, పోష, మనుజ, కరాపక, మానవ, వేదక, కారక, వేదయిత్రుక, జానక, పశ్యక.



# 16. కల్పములు

అవతారిక:- "What is time?" అడిగాడు యజ్ఞదత్తుడు. "Four fifteen" అంటూ జవాబు పలికాడు దేవదత్తుడు. "నేనది అడగడం లేదు. కాలమనగా ఏమి? నిర్వచనం (definition) అడిగాను" అన్నాడు యజ్ఞదత్తుడు. దేవదత్తుడు తెల్లమొహం వేశాడు.

కాలమనే ప్రత్యేక పదార్థం (thing, entity) ఉన్నట్లు తెలియడం లేదు. ప్రకృతిలో కనిపిస్తున్న క్రమం (order) ఆధారంగా (ఉదా: సూర్యుని ఉదయాస్తమయములు) మానవుడు తన వ్యవహారం కొరకు ఏర్పాటు చేసుకొన్న కొలబద్దయే (scale) కాలం అనిపిస్తున్నది. మార్పులను (changes) కొలిచేందుకు మానవుడు ఏర్పాటు చేసుకొన్న ఈ స్కేలులో భాగాలే సెకండ్లు, నిముషాలు, గంటలు, దినాలు, నెలలు, సంవత్సరాలు కల్పాలు, మహాకల్పాలు. కాల సంబంధంగా గతము వర్తమానము, భవిష్యత్తు అనే పదాలున్నాయి. ఇవి సాపేక్షిక పదాలు (relative words). దీపావళి నాడు సాయంత్రం ఆరుగంటల నలభై నిముషాల రెండు సెకండ్ల సమయంలో వీధిలో మూడు టపాకాయల్లో ఒకటి ధాం అని పేలిపోయింది. ఆ పేలుడు గతం. ఇంకొకటి ధాంధాం అని పేలుతూ ఉన్నది. ఆ పేలుడు వర్తమానం. ఇంకొక టపాకాయ ఇంకా పేలలేదు కానీ పేలబోతున్నది. ఆ పేలబోయేది భవిష్యత్తు.

ఉత్పన్నమై (having been produced) నిరుద్ధం అయినది అతీతం (past). ఉత్పన్నమై ఇంకా నిరుద్ధం కానిది వర్తమానం (present). ఆత్మభావాన్ని (existence) ఇంకా పొందనట్టిది అనాగతం (future). ఉత్పత్తిమత్తుల (products) విషయంగానే గతం వర్తమానం భవిష్యత్తు అనే వ్యవహారం. అనుత్పన్నములకు (non-products) గతం లేదు వర్తమానం లేదు భవిష్యత్తు లేదు. కుందేటి కొమ్ముకు గతం లేదు వర్తమానం లేదు భవిష్యత్తు లేదు. వైజ్ఞానికులు కొండల వయస్సు సూర్య చంద్రులు నక్షత్రాల వయస్సు కూడా ఏవో

లెక్కలు కట్టి చెబుతారు. కానీ ఎవరూ ఇంతవరకు ఆకాశం (space) యొక్క వయస్సు లెక్కగట్టి చెప్పినట్లు లేదు. అది అనుత్పన్నం (non-product) కనుక కుదరదు.

'21వ శతాబ్దంలోకి ప్రవేశించబోతున్నాము' అని నేడు ఒకటే కోలాహలం- ఏదో అద్భుతమైన గుహలో ప్రవేశించబోయే మాదిరి!.

బౌద్ధ సాహిత్యంలో కాలంకొలబద్ధ మన ఊహకు అందనంతగా (mind bogglingగా) ఉంటుంది. కల్పాలు, మహాకల్పాలే! కల్పం అనేది ఎన్ని సంవత్సరాలు చెప్పాలంటే ఊహాచ్ఛితం చూపవలసినదే. ఒక మైలు పొడవు, మైలు వెడల్పు, మైలు ఎత్తు ఉన్న ఏకశిలను ఊహించండి. వంద సంవత్సరాలకొకసారి ఆ శిలను మృదువైన బనారసు సిల్కు గుడ్డతో అలవోకగా స్పృశించడం ఊహించండి. ఆ స్పర్శలకు ఆ శిల ఎప్పుడు పూర్తిగా అరిగిపోతుందో అప్పటికి కూడా కల్పం పూర్తి కాదు. మరి ఇలాంటి కల్పాలు ఇప్పటికి ఎన్ని గడిచాయి? సప్తసముద్రాల తీరాల్లోని ఇసుక రేణువులు ఎన్ని ఉన్నాయో అన్ని కల్పాలు ఇప్పటికి గడిచాయి! క్రింది పేరాలోనూ కల్పం అనే పదం ఉన్నందువల్ల ఈ అవతారిక! అంకెలు సంఖ్యలు కూడా బౌద్ధంలో mind boggling గానే ఉంటాయి. గణితంలో సున్నను ప్రవేశపెట్టింది బౌద్ధులే అని Edward Conze గారి క్రింది వాక్యాల వల్ల తెలుస్తున్నది.

*It is one of the ironies of history that Buddhism, this most uncommercial and even anticommercial system, should have been responsible for the elaboration of a tool without which modern commercialism could scarcely have been developed. Without the invention of zero, or nought, our shopkeepers, bankers and statisticians would still be hampered right and left by the clumsiness of the abacus. The little circle which we know as zero, was known to the Arbs about 950A.D. as shifr, empty. This became cifra in Latin, when about 1150 the nought came to Europe. In English we had originally 'cypher' as the name for zero, and cypher is nothing but the sanskrit word sunya.*

*–Buddhism page 131 footnote*

*పై foot note కి మరో note గా Connze గారి వాక్యాలనే ఇస్తున్నాను.*

*Although in Buddhist art emptiness is usually symbolised by an empty circle, one must not regard the Buddhist emptiness as a mere nought or a blank. It is a term for the absence of self, or for self–effacement*

*అనువాదం*

సుభూతీ, ఏ కులపుత్రులుగానీ కులదుహితలుగానీ ఈ సూత్రమును గ్రహింతురో ధారణ చేయుదురో వచియింతురో అధ్యయనము చేయుదురో యోనిశ మనసికారముతో (proper attention) చింతన చేయుదురో ఇతరులకు తెలియజెప్పుదురో అట్టివారు పరిభూతులు (humbled) సుపరిభూతులు (well humbled) అగుదురు. ఎందులకనగా, వారు పూర్వజన్మలలో చేసుకొన్నట్టి అశుభకర్మలను, అధోగతికి నెట్టగల ఆ కర్మలను ఈ పరిభూతత(వినయం) ద్వారా వర్తమాన జన్మమునందే పూర్తిగా తుడిచిపెట్టగలరు. బుద్ధబోధిని పొందగలరు. ఎందులకనగా, అతీత కాలములో దీపంకర తథాగతుని కంటె పూర్వము అసంఖ్యేయ కల్పములకు పూర్వము అసంఖ్యేయతర కల్పములకు పూర్వము నుండియే నేను సాధన మార్గములో పయనించుచు నా సుదీర్ఘ ప్రయాణములో చతురశీతి బుద్ధ కోటి నియుత శత సహస్ర బుద్ధులను (84,000 million milliards of Buddhas) ఆరాధించాను (gave satisfaction by loyal service). ఎన్నడూ విరాగితుడను (estranged from them) కాలేదు. ఈ విధముగా నేను గడించిన అంత పుణ్యస్కంధము రాబోవు కాలములోనివారు గడించబోయెడి పుణ్యస్కంధముతో పోల్చుకొనినచో అసలు పోలికకు నిలబడజాలదు. చివరి ఐదవదియైన ఐదువందల ఏండ్ల కాలములో (1956) సద్ధర్మము లోపించిన ఆ కాలములో ఎవరయితే ఈ సూత్రమును గ్రహింతురో ధారణ చేయుదురో వచియుంతురో అధ్యయనము (study) చేయుదురో ఇతరులకు తెలియజేయుదురో అట్టివారు పొందబోయెడి పుణ్యస్కంధములో నూరవ భాగము కూడా కాదు నేను గడించినది. వెయ్యవ భాగము కూడా కాదు. లక్షవ భాగము కూడా కాదు. కోటియవ భాగము కూడా కాదు. వందకోటియవ భాగము కూడా

కాదు. వేయి కోటియవ భాగము కూడా కాదు. లక్షకోటియవ భాగము కూడా కాదు. కోటి నియుత శత సహస్రతమ భాగము కూడా కాదు (1,00,000 millionth part). పోలిక విషయముగా నా పుణ్యము, సంఖ్యకు (number), కళకు (fraction), గణనకు (counting), ఉపమకు (comparison), ఉపనిషదమునకు (resemblance) నిలువజాలదు.

సుభూతీ, నేను గనుక ఆ కులపుత్రులు కులదుహితలు గడించబోవు పుణ్యస్కంధ పరిమాణమును (measure) గురించి ఇంకనూ ఎక్కువ భాషించినచో ఇక్కడ వినువారల చిత్తములు ఉన్మాదములగును లేదా విక్షేపములగును (become frantic and confused). సుభూతీ, ఈ ధర్మపర్యాయము అచింత్యమని (unthinkable) తథాగతుడు భాషించినాడు. కనుక దీని పఠన ఫలము కూడా అచింత్యమే అగును.

Note:- సదాపరిభూతుడు (Ever Despised) అనే బోధిసత్త్వుడుండేవాడు. ఎవరైనా దారిలో ఎదురైతే చాలు వినయంగా నమస్కరించి "మీ మీద నాకు చాలా గౌరవం ఉన్నది. మిమ్మల్ని నేను ఎప్పటికీ అసహ్యించుకోను. భవిష్యత్తులో మీరు తథాగతులు అర్హతులు సమ్యక్ సంబుద్ధులు కాబోతున్నారు" అని పలికేవాడు. ప్రజలు మొదట్లో అతణ్ణి, అతని మాటలను ఉపేక్షించి ఊరుకున్నారు. కానీ ఎదుట పడినప్పుడల్లా అతడు అదే వరసగా వ్యాకరిస్తుంటే (predict చేస్తుంటే) వాళ్లకు చిరాకు వేసి "ఎవడ్రా నీవు? మాకొక తలనొప్పిగా తయారయ్యావు. మాకు బుద్ధత్వం కలుగుతుంది, బుద్ధత్వం కలుగుతుంది అని ఊదరగొట్టున్నావు. బుద్ధత్వాన్ని మేమేమీ కోరుకోవడం లేదు. పోరా పో" అని కసిరికొట్టూ అవమానించేవాళ్లు. అయినా అతడు తన పద్ధతిని మార్చుకోలేదు. ఆ తరువాత అతను కనిపిస్తే చాలు దగ్గరకు రానీయకుండా రాళ్లు తీసుకొని అతని మీదికి రువ్వేవాళ్లు. సదాపరిభూతుడు పారిపోయి ఒక చెట్టు వెనకో గోడ వెనకో దాక్కొని అక్కడ్నుంచే వాళ్లకు వినిపించే విధంగా ఉచ్చైఃస్వరంతో "మీ మీద నాకు చాలా గౌరవం ఉన్నది, పూజ్యభావం ఉన్నది. భవిష్యత్తులో మీరు తథాగతులు, అర్హతులు, సమ్యక్ సంబుద్ధులు కాబోవుచున్నారు" అని అరచి చెప్పేవాడు. ఇది ఈనాటి కథ కాదు. ఈ లోకధాతువులో జరిగినదీ కాదు. వినిర్భోగ కల్పకాలంలో మహాసంభవ లోకధాతువులో జరిగిన కథ!

(సద్ధర్మపుండరీక సూత్రం నుండి)

# 17. అపరప్రత్యయం

*అవతారిక: అధ్యాత్మిక జీవితం అనేది voyage on uncharted sea లాంటిదని ఒకాయన అన్నాడు. risk తీసుకోగల సాహసికులు మాత్రమే ఈ ప్రయాణం చేయగలరు. ఎవరో ఒకరు ఇచ్చిన నమూనా (plan) ప్రకారం ప్రయాణించడం లాభకారి కాదు. అది అసలు ప్రయాణమే కాదు. ప్రయాణం చేస్తున్నట్లుగా భ్రమించడమే అవుతుంది. చిన్నపిల్లవాడు కొయ్యగుర్రం మీద కూర్చొని దాన్ని క్రిందికి పైకి కదిలిస్తూ స్వారి చేస్తున్నట్లుగా భావిస్తాడు కదా!*

*అసంఖ్యేయ కల్పాలకు పూర్వం సుమేధుడనే యువకుడు దీపంకర తథాగతుణ్ణి చూసి ఉత్తేజితుడైనాడు (inspired). సకల జీవుల హితం కోసం ఉద్యమిస్తానని దీక్షబూనాడు. ఆ సమయంలో దీపంకర తథాగతుడు సుమేధునికి అధ్యాత్మిక నమూనా (blue print on spirituality) ఏదీ ఇవ్వలేదు. "నీవు భవిష్యత్తులో బుద్ధత్వాన్ని పొందగలవు" అని ఒక ప్రోత్సాహకవాక్యం మాత్రమే పలికి ఊరుకున్నాడు. ఆ తరువాత అసంఖ్యేయకల్పాల సుదీర్ఘ ప్రయాణం తరువాత బోధిసత్త్వుడు సిద్ధార్థుడుగా జనించాడు. బోధివృక్షం క్రింద బుద్ధుడయ్యాడు. బుద్ధుని జ్ఞానం స్వాయంభువం అంటే తనకు తాను తెలుసుకొన్నది. పరమార్థ విషయంలో ఎవరికివారు తెలుసుకోవడం తప్పించి వేరే విధానం లేదు. ఈ విషయాన్నే ఆచార్య నాగార్జునుడు "అపరప్రత్యయం = పర ఉపదేశ అగమ్యం = ఇతరుల ఉపదేశాల ద్వారా తెలియబడేది కాదు. ఎవరికివారు స్వయంగా తెలుసుకోవలసినట్టిది" అన్నాడు. మరి బుద్ధుడు నలభైయైదు ఏండ్ల సుదీర్ఘ కాలం ధర్మచక్ర ప్రవర్తనం చేస్తూ విస్తారంగా బోధించింది ఏమిటి? అని అడిగితే పరమార్థం గురించి బుద్ధుడు ఒక అక్షరం కూడా పలుకలేదు అని సమాధానం. "పరమార్థో హి ఆర్యస్తూష్ణీభావః = ultimate truth is noble silence."*

*వజ్రచ్ఛేదికలో ఇప్పటికే చాలా సార్లు పదాలను వ్యతిరేకపదాలను ఒకే బుట్టలో పడవేయడం* చూశాము. ఇక మీదటా చూస్తాము. పైకి ఎగతాళిగా కనిపించినా పరమార్థ ప్రసంగం తీరు ఎలా ఉండాలో అలానే ఉన్నది. Edward Conze గారి Budhist Thought in India, Page 263 నుండి కొంత భాగం:*

*Affirmation and negation, existence and non–existence, should not be held apart as if they were two. It is the same to be as not to be. If existence and non–existence are equalized, if yes and no are identified, then the disorder of the mind is said to disappear. This step abolishes the principle of contradiction in the sense that it is abrogated in emptiness. For, where true reality is concerned, logical asserting and denying are not ultimately valid operations. It is obvious that to say 'A' is empty of the own–being of 'A' amounts to identifying a dharma with its own negation. In a bold and direct manner the Prajna Paramita Sutras explicitly proclaim the identity of contradictory opposites, and make no attempt to mitigate their paradoxes. What is essential nature is no essential nature, what is practice is no practice, and so on.*

*అనువాదం*

*సుభూతి:–* భగవాన్, బోధిసత్త్వయానములో ప్రయాణించువాడు ఎట్లు స్థిరుడై ఉండవలెను? ఎట్లు పురోగమించవలెను? చిత్తమును ఎట్లు అదుపు చేయవలెను?
*భగవానుడు:–* బోధిసత్త్వయానములో ప్రయాణించువాడు ఈ విధమైన సంకల్పము (resolution) కలిగి యుండవలెను: "సకల సత్త్వులను నేను నిరుపధిశేష నిర్వాణ ధాతువునకు (realm of nirvana which leaves nothing behind) చేర్పించవలెను. నిర్వాణములో సత్త్వులను చేర్పించినప్పటికీ ఏ సత్త్వుడూ నిర్వాణములో చేర్పించబడనివాడే అగును!" ఎందులకనగా, బోధిసత్త్వునిలో సత్త్వసంజ్ఞ తలెత్తినచో

---

*మొత్తం 35 సార్లు

ఇక అతడు బోధిసత్త్వుడనబడడు. జీవసంజ్ఞగానీ పుద్గలసంజ్ఞగానీ తలెత్తినచో ఇక అతడు బోధిసత్త్వుడనబడడు.

సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? సమ్యక్ సంబోధిని పొందుట కొరకు నేను దీపంకర తథాగతుని నుండి గ్రహించిన ధర్మము (formula) ఏదియైననూ ఉన్నదా?

*సుభూతి:-* భగవానులవారు భాషించినది నాకు అర్థమయినది. దీపంకర తథాగతునినుండి భగవానులు గ్రహించిన ధర్మము (plan, method, blue print) ఏదియూ లేదు.

*భగవానుడు:-* అవును సుభూతీ అవును. దీపంకర తథాగతుని నుండి సమ్యక్ సంబోధి పొందుట కొరకు నేను గ్రహించిన ధర్మము ఏదియూ లేదు. అటుల నేను ఏదియేని గ్రహించియుండిన పక్షములో దీపంకర తథాగతుడు నన్ను ఉద్దేశించి ఇట్లు వ్యాకరించి యుండరు (predict చేసియుండరు): "మాణవకా (young man), నీవు భవిష్యత్తులో శాక్యముని పేరున తథాగతుడవు అర్హతుడవు సమ్యక్ సంబుద్ధుడవు అగుదువు". ఎందులకనగా, తథాగత పదము భూతతథతా (true suchness) పదమునకు పర్యాయపదము (సమానార్థక పదము = synonymous ). "తథాగతుడు, అర్హతుడు అయిన సమ్యక్ సంబుద్ధునిచే అనుత్తర సమ్యక్ సంబోధి సాధింపబడినది" అని ఎవడయిననూ పలికినచో అతడు వితథమునే (అబద్ధమునే) పలికినవాడగును. నన్ను దూషించినవాడే అగును. ఎందులకనగా అనుత్తర సమ్యక్ సంబోధి ద్వారా తథాగతుడు సాక్షాత్కరించుకొనిన ధర్మము ఏదియూ లేదు. తథాగతుడు తెలుసుకొనినది బోధించినది సత్యమూ కాదు, మృషయూ కాదు (neither true nor false). కనుకనే "అన్ని ధర్మములు బుద్ధధర్మములు" అని తథాగతుడు భాషించుచున్నాడు. ఎందులకనగా, అధర్మములనే (no-dharmas) తథాగతుడు సర్వధర్మములు అనుచున్నాడు. కనుకనే అన్ని ధర్మములు బుద్ధధర్మములు (Buddha's own special dharmas) అనబడుచున్నవి.

సుభూతీ, కాయుడు, మహాకాయుడైన పురుషుడు . . . .

*సుభూతి:–* తథాగతులవారు కాయుడు మహాకాయుడు అని పలుకుచున్నది నిజమునకు అకాయమునే (no–body) కనుకనే అది ఉపేతకాయము (endowed with body), మహాకాయము (huge body) అనబడుచున్నది.

*భగవానుడు:–* సుభూతీ, "నేను సత్త్వులను నిర్వాణమునకు చేర్పించెదను" అని ఏ బోధిసత్త్వుడయిననూ పలికినచో అతడు బోధిసత్త్వుడు కాడు. ఎందులకనగా, బోధిసత్త్వుడు అను ధర్మము (a seperate entity) ఏదియైననూ ఉన్నదా?

*సుభూతి:–* లేదు భగవాన్. బోధిసత్త్వుడనెడి ధర్మము (entity) ఏదియూ లేదు.

*భగవానుడు:–* సత్త్వులు సత్త్వులు అని తథాగతుడు అసత్త్వులనే భాషించుచున్నాడు. కనుకనే సత్త్వములు అనబడుచున్నవి. కనుకనే తథాగతుడు "సర్వధర్మములు నిరాత్మమములు, నిస్సత్త్వములు, నిర్జీవులు, నిష్పుద్గలులు" అనుచున్నాడు.

సుభూతీ, ఏ బోధిసత్త్వుడయిననూ "నేను క్షేత్రవ్యూహములను (harmonies of Buddha fields) నిష్పాదించెదను (create)" అని పలికినచో అతడు బోధిసత్త్వుడు కాడు. ఎందులకనగా, క్షేత్రవ్యూహములు క్షేత్రవ్యూహములు అని తథాగతుడు అవ్యూహములనే (no–harmonies) భాషించినాడు. కనుకనే క్షేత్రవ్యూహములు అనబడుచున్నవి.

సుభూతీ, ఏ బోధిసత్త్వుడు "సర్వధర్మములు నిరాత్మానములు (without self), నిరాత్మానములు సర్వధర్మములు" అని గాఢముగా భావించునో అట్టి బోధిసత్త్వుడిని తథాగతుడు మహాసత్త్వుడని చెప్పినాడు.



# 18. పంచచక్షువులు

*అవతారిక:- మాంసచక్షువు, దివ్యచక్షువు, ప్రజ్ఞాచక్షువు, ధర్మచక్షువు, బుద్ధచక్షువు అని పంచచక్షువులు. మానవుల మాంసచక్షువులకు వర్ణ సంస్థానములు (colours and shapes) తెలుస్తాయి. (సంస్థానముల విషయంలో వివాదం ఉన్నది.) నీలం, పీతం (yellow), లోహితం (red), అవదాతం (white), దీర్ఘం, హ్రస్వం, వృత్తం (sqare), పరిమండలం (round), ఉన్నతం (high), అవనతం (low), సాతం (even), విసాతం (uneven), అభ్రం, ధూమం, రజస్సు, మహిక (mist), ఛాయ, ఆతపం, ఆలోకం, అంధకారం – ఇవి మాంసచక్షువు ద్వారా తెలిసే విషయాలు (objects). ఆబాలగోపాల అంగనా జనాలకు మాదిరే ఈ మాంసచక్షువు బుద్ధునికీ ఉన్నది. ఇతర చక్షువులన్నీ అలౌకికములు (supra-mundane). అన్నిరకాల మైక్రోస్కోపులు టెలిస్కోపులు మనస్సులోనే ఉన్నాయి. వాటిని పనిచేయించాలంటే ధ్యానములు అవసరం.*

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతునికి మాంసచక్షువు కలదా?

*సుభూతి:-* తథాగతునికి మాంసచక్షువు ఉన్నది.

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతునికి దివ్యచక్షువు (divine eye) ఉన్నదా?

*సుభూతి:-* ఉన్నది భగవాన్.

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతునికి ప్రజ్ఞాచక్షువు (wisdom eye) ఉన్నదా?

*సుభూతి:-* ఉన్నది భగవాన్.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతునికి ధర్మచక్షువు ఉన్నదా?

*సుభూతి:–* ఉన్నది భగవాన్.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతునికి బుద్ధచక్షువు ఉన్నదా?

*సుభూతి:–* తథాగతునికి బుద్ధచక్షువు కలదు.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? గంగానది ఇసుకరేణువుల గురించి తథాగతుడు భాషించినాడా?

*సుభూతి:–* అవును భగవాన్, అవును సుగతా, గంగానది ఇసుకరేణువులను తథాగతుడు భాషించినాడు.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? గంగానది ఇసుక రేణువులు ఎన్ని ఉన్నవియో అన్ని గంగానదులు, ఆ అన్ని గంగానదుల ఇసుకరేణువులు ఎన్ని ఉన్నవియో అన్ని లోకధాతువులు (world systems) ఉండినచో వాటి సంఖ్య బహుళమేనా?

*సుభూతి:–* అవును భగవాన్, అవును సుగతా, ఆ లోకధాతువుల సంఖ్య బహుళమే.

*భగవానుడు:–* సుభూతీ, ఆ అన్ని లోకధాతువులలో సత్త్వులు ఎందరున్నారో ఆ అందరి నానా రకముల చిత్తధారలను (manifold trends of thought) నేను ఎరుగుదును. ఎందులకనగా చిత్తధార చిత్తధార అని తథాగతుడు పలుకుచున్నది అధారనే (no–trends). ఎందులకనగా అతీత చిత్తము (past thought) తెలియబడుట లేదు (unfindable). అనాగత చిత్తమూ (future thought) తెలియబడుట లేదు. వర్తమాన చిత్తమూ తెలియబడుట లేదు.

Note:- చిత్తము కూడా ప్రతీత్య సముత్పన్నమే (dependently originated) కనుక స్వభావశూన్యము (own–being/ intrincic existence/ self–nature లేనిది.) ప్రతీత్యసముత్పన్నం కానిది ఏదీ లేదు. అంతా పరస్పర సాపేక్షికములే (inter–related). దీనిని వివరముగా తెలిపే ప్రయత్నము ఈ రచయిత భవిష్యత్తులో చేయగలడు.

# 19. అస్కంధము (no-heap)

*అవతారిక:- కరాటే, కుంగ్‌ఫూ లాంటి ఆత్మరక్షక విద్యలను (self-defensive martial arts) ప్రవర్తింపజేసినవాడుగానూ బోధిధర్ముడికి ఖ్యాతి ఉన్నది. క్రీ.శ.6వ శతాబ్దంలో ఈయన చైనాకు వెళ్లి అక్కడ ధ్యాన సంప్రదాయానికి (Zen school) ఆది గురువయ్యాడు.*

*ఒకసారి చైనాదేశ చక్రవర్తి బోధిధర్మునితో "నేను డెబ్బైరెండు విహారాలు నిర్మించాను. నలభై నాలుగు దేవాలయాలు కట్టించాను. వేలాది భిక్షువులకు వస్త్రదానం అన్నదానం ఔషధదానం ఏర్పాట్లు చేసి యున్నాను. సూత్రం, శాస్త్రం ప్రతులు ఇప్పటికి ముప్పైఎనిమిది వేలు వ్రాయించియున్నాను. ఇరవై ఏండ్లుగా ఒక్క ఉపోషధం కూడా వదలకుండా నియమాలు పాటించాను. సద్ధర్మ పుండరీక సూత్రాన్ని ఇప్పటికి మూడువందల నలభైనాలుగు సార్లు పారాయణం చేసియున్నాను. ఇంకా ధార్మిక కార్యాలు అనేకం చేసియున్నాను. నాకు ఎంత పుణ్యం కలిగిందో భదంతులవారు సెలవివ్వాలని మనవి చేస్తున్నాను" అన్నాడు.*

*బోధిధర్ముడి నేత్రాలు చాలా పెద్దవిగానూ ముందుకు ఉబికియున్నట్లుగానూ ఉంటాయి. మామూలుగా చూసినా గ్రుడ్లురుమి చూసినట్లుగా ఎదుటివాళ్లకు అనిపిస్తుంది. ఆ చక్రవర్తి ప్రశ్నకు సమాధానంగా ఒక్కమాట కూడా పలక్కుండా చూపుడు వేలితో ఆకాశంలో (space) పెద్ద వృత్తాన్ని చుట్టుతూ ఆ చక్రవర్తికి సంకేతం ద్వారా shocking జవాబిచ్చాడు.*

*వజ్రచ్ఛేదిక మళ్లీ దానము, పుణ్యఫలం గురించి చెప్పబోతున్నది. ఏ మంచి పనియైనా సరే స్వరసంగా (spotaneousగా) నిరభిమానంగా (without self-consciousness) జరిగితేనే అందం.*

## అనువాదం

*భగవానుడు:–* ఏ కులపుత్రుడుగానీ కులదుహితగానీ ఈ త్రిసాహస్ర మహాసాహస్ర లోకధాతువును సప్తరత్నములతో నింపి అర్హతులు తథాగతులు అయిన సమ్యక్ సంబుద్ధులకు దానము చేసినచో కలిగెడి పుణ్యస్కంధము బహుళమేనా?

*సుభూతీ:–* బహుళమే భగవాన్.

*భగవానుడు:–* అవును సుభూతీ అవును. బహుళమే. ఆ పుణ్యస్కంధము అప్రమేయము, అసంఖ్యేయము. ఎందులకనగా, పుణ్యస్కంధము పుణ్యస్కంధము అని తథాగతుడు భాషించుచున్నది అస్కంధమునే (no–heap). కనుకనే పుణ్యస్కంధము అనబడుచున్నది. స్వభావతః (in it's own being) పుణ్యస్కంధము లేదు కనుకనే తథాగతుడు పుణ్యస్కంధము పుణ్యస్కంధము అనుచున్నాడు.



# 20. శూన్యత

అవతారిక:- వజ్రచ్ఛేదికలో ఎక్కడా "శూన్యతా" పదం కనపడదు. కానీ ప్రతి పేరాలోను శూన్యతా చికిత్స (emptiness therapy) కనిపిస్తుంది. శూన్యత అనే పదం ఏదో ఒక భావమునకు పెట్టిన పేరు కాదు. అభావ పదానికి పర్యాయ పదమూ కాదు. మనస్సును ఉపశమనానికి (peace) నెట్టే ఒకానొక technique పేరు అనుకోవచ్చు. మనస్సును గందరగోళం పాలు చేసేవి చాలా వరకు పదాలే కనుక ఈ పదాలన్నీ అర్థశూన్య పదాలు (empty words / meaningless words) అని తెలిస్తే మనస్సు మీద ఆ పదాల పట్టు చాలా వరకు తగ్గిపోయి ఉపశమనం లభిస్తుంది. శూన్యతా చింతన వల్ల కరుణ అనే active altruistic energy ఉత్పన్నం అవుతుంది. శూన్యతా ధ్యానం అలవడితే మరణభయం మొదలుకొని అన్ని భయాలు పోతాయి. ఉన్నది (అస్తి) ఉన్నది(అస్తి) అనుకొంటూ ఉండడం వల్లనే మరణ సమయంలో out అనే భయం కలిగేది! శూన్యతా చింతన ఆసక్తిని (attachment) తగ్గించివేస్తుంది. వజ్రచ్ఛేదిక శూన్యతను ముక్కు మీద గుద్దినట్లుగా చెబుతుంది. ఈ శూన్యతనే మహాయాన శాస్త్రకారులు వివరించి చెబుతారు. నాగార్జునుడు logical approach అవలంబించి వివరించాడు. అసంగుడు psychological approach అవలంబించి వివరించాడు. భవిష్యత్తులో ఈ వివరణల ద్వారా కూడా శూన్యతను గురించి తెలుసుకుందాము. శూన్యతకు పర్యాయపదములు:- 1.మధ్యమా ప్రతిపత్ (middle path which is free from all sorts of dualities such as భావ x అభావ, అస్తి x నాస్తి, శాశ్వత x ఉచ్ఛేద. 2. ఉపాదాయ ప్రజ్ఞప్తి =dependent designation. Stcherbatskyగారు శూన్యతను సరళంగా ఇంగ్లీషులో relativity (సాపేక్షికత)అని అనువదించారు. 3.ప్రతీత్య సముత్పాదం (dependent origination / dependent existence / dependent establishment)

## *అనువాదం*

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? రూపకాయ (divine body, celestial body) పరినిష్పత్తి (accomplishment) కలిగినవాడుగా తథాగతుడిని చూడదగునా?

*సుభూతి:–* చూడరాదు భగవాన్. ఎందులకనగా, రూపకాయ పరినిష్పత్తి రూపకాయ పరినిష్పత్తి అని తథాగతులవారు అపరినిష్పత్తినే (no–accomplishment) భాషించుచున్నారు. కనుకనే రూపకాయ పరినిష్పత్తి అనబడుచున్నది.

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? లక్షణసంపద కలిగినవాడుగా తథాగతుడిని చూడదగునా?

*సుభూతి:–* చూడరాదు భగవాన్. ఎందులకనగా, తథాగతులవారు భాషించిన లక్షణసంపద నిజమునకు అలక్షణ సంపద (possession of no–marks). కనుకనే లక్షణసంపద అనబడుచున్నది.



# 21. సత్త్వాలు (Beings)

అవతారిక:- ప్రాచీనగ్రంథాలు, గ్రంథకారులు ముఖ్యం కాదు. మన జీవితమే ముఖ్యం. గ్రంథాల మీద గ్రంథకర్తల మీద మనకు నిజమైన గౌరవం, భక్తి, శ్రద్ధ కలుగాలంటే ఆ గ్రంథాల వల్ల జీవితంలో ఎంతో కొంత మంచి మార్పు మనలో జరుగాలి. "పఠనం వల్ల లేదా శ్రవణం వల్ల నాలో వచ్చిన మార్పేమి?" అని ఆత్మపరిశీలన చేసుకొంటూ ఉండకపోతే పఠన శ్రవణాదులు కేవలం పదాలను పోగుచేసుకోవడం అనే వ్యర్థవ్యాపకం అవుతుంది.

మామూలు మానవుల వాక్యాలు మనకు సరిగా అర్థం కావాలంటే ఆ వాక్యాల్లోని పదాలను ఆ వక్తగానీ రచయితగానీ ఏ అర్థం (meaning) వ్యక్తం చేయడానికి ప్రయోగించాడో జిజ్ఞాస అవసరం అవుతుంది. ఎందుకంటే ఆ వాక్యాలు సంకల్పచిత్తం నుండి (volitional act of the brain) వెలువడినాయి కనుక. బుద్ధుని ఉపదేశ వాక్యాలు అలాంటివి కావు. "ఏదో ఒకటి చెప్పాలి" అనే వివక్షతో (వక్తుం ఇచ్ఛా వివక్షా = మాట్లాడాలనే ఉబలాటం) వెలువడినవి కావు. వినేయజనుల అవసరాలను బట్టి ధర్మకాయం నుండి వెలువడినట్టివి. కల్పవలక్షం, కామధేనువు వంటివి. భక్తి, శ్రద్ధ, వినయం, గౌరవం, ప్రేమ ఉంటే ఆ వాక్యాల నుండి ఎవరికి హితమైన అర్థం (meaning) వారికి అందుతుంది. మధ్యవర్తులుగా వ్యాఖ్యాతలు, పండితులు, గురువులు అవసరం లేదు. ఎవరికివారు వ్యాఖ్యాతలుగా మారి అర్థం చేసుకొనే ప్రయత్నం చేయాలి. భాషాపరమైన ఇబ్బందుల వల్ల వ్యాఖ్యాతల సహాయం తీసుకోవచ్చు. ఆ ఇబ్బంది అధిగమించాక వ్యాఖ్యాతలకు వీడ్కోలు పలికి స్వంతంగానే అర్థం చేసుకోవాలి. స్వీయశక్తిని తక్కువ అంచనా వేసుకోరాదు.

## అనువాదం

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? "నేను ధర్మమును ఉపదేశించితిని" అని తథాగతుడు అనుకొనునా?

*సుభూతి:–* తథాగతులవారు అటుల అనుకొనరు.

*భగవానుడు:–* సుభూతీ, "తథాగతుడు ధర్మమును ఉపదేశించెను" అని ఎవడయిననూ పలికినచో వితథమును (false) పలికినవాడే అగును. అసద్గ్రాహముచే (seizing on what is not) అతడు నన్ను అభ్యాచక్షించినవాడగును (misrepresent me). ఎందులకనగా, ధర్మదేశనము, ధర్మదేశనము అనదగిన ధర్మమేదియూ (unrelated, independent, self–existent event) ప్రత్యేకముగా తెలియబడుట లేదు.

*సుభూతి:–* భగవాన్, భవిష్యత్తులో రాబోవు చివరి ఐదవ ఐదువందల కాలములో సద్ధర్మము లోపించిన ఆ కాలములో ఇటువంటి ధర్మములను విని శ్రద్ధ వహించు సత్త్వులు ఎవరయిననూ ఉందురా?

*భగవానుడు:–* సుభూతీ, వారలు సత్త్వులు కారు, అసత్త్వులు కారు. ఎందులకనగా సత్త్వులు సత్త్వులు అని అసత్త్వులనే తథాగతుడు భాషించినాడు. కనుకనే సత్త్వులు అనబడుచున్నారు.



# 22. అకించనములు

*అవతారిక:- సంయుక్త నికాయం నుండి ఒక గాథ (stanza) ఉపశివుడు అనే భిక్షువు ఒకనాడు బుద్ధుణ్ణి ఇలా ప్రార్థించాడు*

*ఏకో అహం శాక్య మహాంతం ఓఘమ్*
*అన్నిశ్శితో న విసహామి తారితుమ్*
*ఆరమ్మణం బ్రూహి సమంతచక్షు*
*యం న్నిశ్శితో ఓఘం ఇమం తరేయుమ్*

*శాక్యమునీ నేను ఏకాకిని, నిస్సహాయుడను. మహాంతమైన ఈ ఓఘం నుండి (great flood = our day to day miserable life) బైటపడలేకున్నాను (stepping out వీలుకావడం లేదు). సమంతచక్షూ (O All seeing one), నేను ఏ ఆలంబనం (objective support) సహాయంతో ఈ ఓఘం నుండి బైటపడగలనో దానిని నాకు చెప్పుము.*

*బుద్ధుడు:- అకించనం (nothing whatever-anywhere = ఎక్కడా ఏమీ లేదు) మీదనే మనస్సును ఉంచుము. "ఎక్కడా ఏమీ లేదు" అనే నిశ్చయం ద్వారానే నీవు కోరికలను వదులుకోగలవు. వాగుడు నుండి విరతుడవు కాగలవు. తృష్ణాక్షయమును (extinction of craving) సాధించగలవు. "*

* * * * *

అకించనములు (శూన్యతలు) ఎన్ని ఉన్నాయి? అని అడిగితే కించనములు (some thingలు) ఎన్ని ఉన్నాయనిపిస్తున్నాయో అన్ని అకించనములున్నాయని చెప్పవచ్చు. కించనములకు వేరుగా భిన్నంగా అకించనములుండవు. పైపై చూపుకు కనిపించే కించనమే పరీక్షకు, విచారానికి (analysis) గురి అయితే అకించనం అవుతుంది.

ఎందుకంటే కించనములకు పరమార్థసిద్ధి (ultimate establishment) లేదు. సత్యసిద్ధి (true establishment) లేదు. స్వలక్షణసిద్ధి (establishment by way of own character) లేదు. సమ్యక్‌సిద్ధి (establishment as their own reality) లేదు. తత్త్వసిద్ధి (establishment as their own suchness) లేదు. స్వభావతాసిద్ధి (establishment by way of their own entities) లేదు. ద్రవ్యసిద్ధి (substantial establishmement) లేదు. స్వరూపసిద్ధి (establishment from own side) లేదు. ఈ తొమ్మిది పదాలూ పర్యాయపదాలే (synonyms).

ఇక 16శూన్యతల పట్టిక తెలుసుకొని ముందుకు పోదాము.

1. అధ్యాత్మశూన్యతా (emptiness of the internal sense–fields).
2. బహిర్ధాశూన్యతా (emptiness of external things). మొదటిది భోక్తృ శూన్యత (emptiness of the experiencer), రెండవది భోజన శూన్యత (emptiness of the experienced).
3. అధ్యాత్మబహిర్ధాశూన్యతా (emptiness of the internal and external).

   బోక్తృభోజనములకు అధిష్ఠానంగా (seat) శరీరం ఉన్నది. ఈ శరీరం యొక్క emptinessకి అధ్యాత్మ బహిర్ధా శూన్యత అని పేరు.
4. శూన్యతాశూన్యతా (emptiness of emptiness). పరీక్షకు, విచారానికి ఏదీ నిలబడదు. శూన్యత కూడా. "శూన్యత" అనేది ఏమిటి అనే విచారానికి దిగితే తేలేది శూన్యతా శూన్యత.
5. మహాశూన్యతా (emptiness of the vast extentions). పదిదిక్కులు ఎక్కడ అంతం అవుతున్నాయో ఇప్పటి వరకూ ఎవరూ చెప్పలేదు. ఈ మహాదిక్కుల శూన్యతకు మహాశూన్యత అని పేరు.
6. పరమార్థశూన్యతా (emptiness of ultimate truth). పరమార్థం అనగా నిర్వాణం. నిర్వాణానికి కూడా own–being లేదు కనుక పరమార్థ శూన్యత.

7. సంస్కృతశూన్యతా (emptiness of composite things). సంస్కృతం అంటే హేతు ప్రత్యయములచే ఏర్పడినవి అని అర్థం = All types of products = మొత్తం త్రైధాతుకం.

8. అసంస్కృతశూన్యతా (emptiness of Unconditioned things).

9. అత్యంతశూన్యతా (emptiness of transcendence of extremes). అంతములు అంటే extremes. అంతములు అనే అగాధములలో పడకుండా ఉండేది అత్యంతము. అదియే మధ్యమా ప్రతిపత్ = middle path. దీని శూన్యతకు అత్యంత శూన్యత అని పేరు.

10. అనవరాగ్రశూన్యతా (emptiness of that which is without beginning and end) జన్మమరణ సంసార చక్రానికి మొదలు లేదు. తుది లేదు. కనుక సంసారం అనవరాగ్రం. దీని శూన్యతకు అనవరాగ్ర శూన్యత అని పేరు.

ఈ సంసారాన్ని శూన్యతగా చూడకుండా అధివాస్తవికతగా (ultra real) చూస్తే విపరీతమైన విముఖత, భయం కలిగి దూరం కావాలనుకొంటాడు. బోధిసత్త్వదీక్షకు భంగం కలిగిపోతుంది! కనుక సంసారంలోనే ఉంటూ అదే సమయంలో అనాసక్తుడుగానూ ఉండాలి. ఇలా జీవించమని చెప్పడం కోసమే సంసారశూన్యత చెప్పబడింది.

11. అనవకారశూన్యతా (emptiness of the blameless) అవకారములు అంటే వదిలించుకోదగినవి, ఇంగ్లీషులో blame worthy. దీనికి భిన్నమైనది అనవకారం అంటే blameless. ఇవి ఉంచుకోవలసినవి. వీటి శూన్యతకు అనవకార శూన్యత అని పేరు.

12. ప్రకృతిశూన్యతా (emptiness of the fundamental nature).

గోత్రం (lineage) అనే విశేషం ఉన్నది. ఈ గోత్రాన్ని బట్టే శ్రావకులు, ప్రత్యేక బుద్ధులు, బోధిసత్త్వులు అనే విభజన కలిగింది. ప్రతి ఒక్కరిలోనూ ఏదో ఒక

గోత్రం (prominent tendency) ఉంటుంది. ఈ గోత్రాలు కూడా స్వభావ శూన్యములే కనుక ప్రకృతి శూన్యత అని పేరు.

13. సర్వధర్మశూన్యతా (emptiness of all things). సర్వం, సర్వం అని బుద్ధుడు పేర్కొనినది 18 ధాతువులనే (elements). ఆరు ఇంద్రియములు (faculties), వాటి విషయములు ఆరు, ఈ రెంటి స్పర్శ వల్ల (contact, interaction) ఏర్పడే ఆరు విజ్ఞానములు – మొత్తం 18 ధాతువుల విచారమే బౌద్ధం. లేదా మరో రెండు వర్గీకరణల ద్వారానూ విచారం చేసుకోవచ్చు. స్కంధముల వర్గీకరణం, ఆయతనముల (12 doors = 6 sense and 6 sense objects) వర్గీకరణం. వర్గీకరణ విషయంలోనూ భగవానుడు వినేయజనుల రుచులను దృష్టిలో పెట్టుకొని ధర్మదేశనం చేశాడు.

14. స్వలక్షణశూన్యతా (emptiness of distinguishing characterstic). స్వలక్షణం అంటే ఆ వస్తువులో తప్ప ఇతర వస్తువుల్లో సహజసిద్ధంగా ఉండని లక్షణం. అగ్నికి ఉష్ణం స్వలక్షణం. నీళ్లు వేడిగా ఉంటే ఆ వేడిమి నీటి స్వలక్షణం కాదు. అగ్ని నుండి దానికి సంక్రమించిన పరలక్షణము. ఆయా వస్తువుల స్వలక్షణాలను ఇంద్రియజ్ఞానాలు గ్రహిస్తాయి. వస్తువుల సామాన్య లక్షణాలను (common characterstics, అనిత్యత మొదలయినవి) మనస్సు తెలుసుకొంటుంది.

15. అనుపలంభశూన్యతా (emptiness of the unapprehended). వర్తమానం (present) ఏమిటో తెలుసుకొందాము అనుకొనేంతలోనే అది గతం (past) అయిపోతున్నది. ఇక గతం, భవిష్యత్తు అనేవి అభావములు (non–existents) కనుక ప్రత్యక్షజ్ఞానానికి (direct knowledge కి) విషయములుగా ఉండడము లేదు. కనుక త్రికాలములు అనుపలంభములు. ఈ త్రికాలముల శూన్యతకు అనుపలంభ శూన్యత అని పేరు.

16. అభావశూన్యతా (emptiness of non–existence). అభావం అనే పదం స్వతంత్రమైన అర్థాన్ని కలిగిన పదం కాదు. భావం ఉండి మళ్లీ అది లేకపోతే ఆ సంగతి తెలపడం కోసమే అభావ పదం. భావం లేకపోతే అభావం లేదు. అభావం లేకపోతే భావం లేదు. రెండూ సాపేక్షికములే (relative).

ఈ 16 శూన్యతలను ఇంకా సంక్షిప్తం చేసి 4 శూన్యతలుగా చెప్పవచ్చు.

1. భావశూన్యత, 2. అభావశూన్యత, 3. స్వభావశూన్యత, 4.పరభావశూన్యత

కాస్త వివరంగా శూన్యత గురించి ఇక్కడ చెప్పడంలో ఉద్దేశం పాఠకులను గందరగోళ పరచడానికి కాదు. అనవసరమైన contentని మనస్సులోకి రానీయకుండా ఎవరి జీవితం వాళ్లు చక్కగా జీవించడానికి శూన్యతా చింతన సహకరిస్తుందని రచయిత అభిప్రాయం. అధ్యాత్మికంగా మనం ఎంత వికాసం చెందామో స్పష్టంగా మనకు మనమే తెలుసుకోవాలంటే ఇతరుల పట్ల మనం నడుచుకొనే తీరు అనే అద్దంలో (mirror of relationship) చూస్తే తెలిసిపోతుంది. శూన్యతా చింతన లేకపోతే ఎదుటింటి వాకిలి తలుపులు వేస్తున్న చప్పుడు తీస్తున్న చప్పుడు వినబడినప్పుడల్లా తొంగితొంగి చూసే monkey inquisitiveness లాంటి అనేక చిల్లర కుతూహలాలతోనే జీవితం వృథాగా గడిచిపోతుంది. Petty minded, mean minded, unculturned, stupid గా ఉండరాదనుకొనేవాళ్లు ఈ శూన్యతా చింతన వల్ల లాభం పొందవచ్చు.

## *అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతుడు అనుత్తర సమ్యక్ సంబోధి ద్వారా తెలుసుకొనిన ధర్మము ఏదియైనను ఉన్నదా?

*సుభూతి:-* లేదు భగవాన్

*భగవానుడు:-* అవును సుభూతీ అవును. అణుమాత్రము ధర్మము కూడా కనుక్కోవడము జరుగలేదు, పొందడము జరుగలేదు. కనుకనే అనుత్తరా సమ్యక్ సంబోధి, అనుత్తరా సమ్యక్ సంబోధి అనబడుచున్నది.

**Note:-** అభిసంబోధి = full understanding of all dharmas in all their aspects and modes.

# 23. సమత (sameness)

*అవతారిక:– సర్వధర్మముల (all phenomena) సమతను పది విధములుగా చెప్పవచ్చును. క్రింది పట్టికలో ప్రతి పదానికి చివర సమత పదం చేర్చుకోవాలి.*

*1. అనిమిత్త (signless), 2. అలక్షణ (characteristicless), 3. అజాత (unborn), 4. వివిక్త (isolated) 5. ఆదివిశుద్ధ (pure from the beginning), 6. నిష్ప్రపంచ (beyond words), 7. అనావ్యూహ నిర్వ్యూహ (neither accepted nor rejected), 8. మాయా స్వప్న ప్రతిబింబ (like magic, dream and reflection), 9. ప్రతిశ్రుత్కోపమ (like an echo), 10. భావ అభావ అద్వయ (oneness of existence and non–existence)*

అనువాదం

*భగవానుడు:–* సుభూతీ, మరియు ఆ ధర్మము సమము. అందులో విషమము లేదు. కనుకనే అది అనుత్తరా సమ్యక్ సంబోధి అనబడుచున్నది. నిరాత్మత్వము (absence of self) వలన నిస్సత్త్వము వలన నిర్జీవత్వము వలన నిష్పుద్గలత్వము వలన అనుత్తరా సమ్యక్ సంబోధి సమము అయినది. అన్ని కుశల ధర్మముల ద్వారా అది తెలియబడును. కుశల ధర్మములు కుశల ధర్మములు అని తథాగతుడు అధర్మములనే (no–dharmas) భాషించినాడు. కనుకనే కుశల ధర్మములు అనబడుచున్నవి.

Note:-కుశల ధర్మములు (wholesome actions) చాలా ఉన్నాయి. రాగము (greediness), ద్వేషము (ill–will) మోహము (confusion), వీటిచే కలుషితం కాని చిత్తంతో జరిగే పని ఏదైనా కుశల కర్మయే అవుతుంది. కరుణ, ప్రజ్ఞ, మైత్రి మొదలయిన వాటిచే ప్రేరితములైన కర్మలన్నియూ నిశ్చయముగా కుశల కర్మలే.

Note:- బౌద్ధంలో ఒక రకమైన వర్గీకరణము సంస్కృతములు (products) మరియూ అసంస్కృతములు (non-products) అని. అనుత్తర సమ్యక్ సంబోధి ద్వారా బుద్ధుడు తెలుసుకొన్నది అసంస్కృతము

అంటే హేతు ప్రత్యయములచే (causes and conditions) వల్ల ఉత్పన్నమైనది కాదు. పూర్వము లేనిదిగా ఉండి తరువాత ఉన్నది అనిపించుకొన్నదాన్ని ఉత్పన్నం (కలిగినది, పుట్టినది, జనించినది, ఏర్పడినది, తయారయినది) అంటారు. నిర్వాణం అలాంటిది కాదు. మరి పై వాక్యంలో "కుశల ధర్మాల వల్ల అది తెలియబడుతుంది" అన్న బుద్ధ వాక్యానికి అర్థం ఏమిటి? ఉదాహరణ ద్వారా తెలుసుకొందాము. గదిలో కూర్చొనియున్న యజ్ఞదత్తుడికి ఉక్కపోసింది. మూసియున్న కిటికీ తలుపులను తెరచాడు. గదిలోనికి గాలి వీచింది. ఉక్కపోయింది. కిటికీ తలుపులు తెరవడం అనే క్రియ వల్ల గాలి జనించలేదు. యజ్ఞదత్తుడు కేవలం అడ్డంకిని తొలగించి గమ్మున కూర్చున్నాడు. కుశలకర్మలు ఇంకా రకరకాల సాధనలు ధ్యానాలు వగైరా కిటికీ తలుపులు తెరచి ఉంచే ప్రయత్నంగానే భావించాలి. అసంస్కృతం ఎప్పుడు అనుగ్రహిస్తుందో అది దాని ఇష్టం. "అయ్యో, అసంస్కృతం ఇంకా సాక్షాత్కరించలేదే" అని ప్రతిదినం సాయంత్రం అయేటప్పటికి ఏడవనక్కరలేదు.



# 24. ఆవరణాలు

*అవతారిక:- "శూన్యత" అనేది common sense కి పూర్తిగా విరుద్ధంగా ఉందని పైకి అనిపిస్తుంది. కానీ లోతుగా చూస్తే common sense తో సుఖంగా జీవించమనే శూన్యతా సందేశము. నిర్వాణానికి సంసారానికి కించిత్ భేదం కూడా కనబడడం లేదని నాగార్జునుడు అన్నాడు. కనుక దైనందిన జీవితంలో బాగా involve అవుతూ ఆదే సమయంలో aloof గానూ ఉండగలగడమే కావలిసింది. అధ్యాత్మికత పేరిట అర్థం పర్థం లేని బరువును (శీలవ్రత పరామర్శ = clinging to mere rites, rituals, silly rules and regulations etc) మోయడం దండగ. బాలపృథక్‌జనుల చేత (foolish common people) మహాత్ముడు, మహాత్మురాలు అనిపించుకొనే లాభం ఉంటే ఉండవచ్చు!*

*జ్ఞేయావరణం (obstructions of the knowable), క్లేశావరణం (obstructions consisting simply of afflictions) అని మనస్సులో రెండు ఆవరణాలున్నాయి. మొదటిది తొలగిపోవడం చాలా కష్టం. శూన్యత గురించి అర్ధశతాబ్దం పాటు విచారం చేసినవారికైనా సరే కన్నులు తెరిస్తే ఘటపటాదులు కనిపించి తీరుతాయి. కానీ విచారశ్రమ వృథా అనుకోనక్కర లేదు. క్లేశావరణం చాలా మటుకు వదలిపోవచ్చు. ఘటపటాదులు కనిపించడం వల్ల నష్టమేమీ లేదు. వాటి పట్ల రాగద్వేషాదులు ప్రదర్శించకుండా నేర్పుగా మెలిగితే చాలు.*

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, ఏ పురుషుడుగానీ స్త్రీగానీ ఈ త్రిసాహస్ర మహా సాహస్ర లోకధాతువులో ఎన్ని మేరు పర్వతములున్నవియో (వందకోట్ల మేరు పర్వతాలు) అన్ని మేరుపర్వతముల ఎత్తున సప్తరత్నముల రాశులను పోసి ఒకటి చేసి ఆ మొత్తమును తథాగతులు అర్హతులు అయిన సమ్యక్ సంబుద్ధులకు దానము చేసి గడించిన

పుణ్యస్కంధము కంటెనూ ఎక్కువ పుణ్యస్కంధమును ఈ ప్రజ్ఞాపారమిత అనెడి ధర్మపర్యాయము నుండి కనీసము నాలుగు పాదముల నయిననూ గ్రహించి ఇతరులకు తెలియజెప్పెడి కులపుత్రుడుగానీ కులదుహితగానీ గడించెదరు. సుభూతీ, ఈ పుణ్యస్కంధముతో పోల్చినచో పైన తెలిపిన పుణ్యస్కంధము నూరవ భాగము కూడా చేయదు ..... ఉపనిషదమునకు (comparison) అసలు తట్టుకొని నిలబడజాలదు.



# 25. ఆత్మగ్రాహం

అవతారిక:- పుస్తకాల్లో కనిపించే "ఆత్మ"ను బౌద్ధంలో ఏ శాఖా పట్టించుకోదు. పుస్తకాల్లోని ఆత్మను నిషేధించడం వల్లగానీ ఆమోదించడం వల్లగానీ అధ్యాత్మికంగా ఒనగూడే ప్రయోజనం ఏమీ లేదు. మనకు అందరికీ అనుభవంలో ఉన్న పుద్గలుడి (sense of individuality) మీదనే బౌద్ధం బాణాలను సంధిస్తుంది. నిషేధించే ముందు నిషేధింపబడేది ఏమిటి అనేది స్పష్టంగా తెలియాలి. టిబెటన్ సాధకులు ఆత్మనిషేధం అనే శూన్యతా ధ్యానాన్ని ప్రారంభించే ముందు రెండు మూడు నెలల పాటు నిషేధింపబడేదాన్ని స్పష్టంగా గుర్తించే ప్రయత్నమే చేస్తారట. మనలోని ఆత్మను ఆత్మగా పట్టుకోవడం, గుర్తించడం చాలా కష్టమే. సాధారణంగా అది పంచస్కంధాల్లో ఏదో ఒకదానితోనో కొన్నిటితోనో జతకట్టిన విధమే మనకు అనుభవం. దాన్ని దానిగా పట్టుకొనే ప్రయత్నం మనం చేయడం లేదు. లేనిదాన్ని పట్టుకొనే ప్రయత్నం ఎందుకు? అంటే లేదని ఎవరన్నారు? పంచస్కంధాలను అపేక్షించి (depending) పుద్గలుడు (personality) ఉండనే ఉన్నాడు. అవమానం పొందిన సమయాల్లో బాధపడింది ఈ పుద్గలుడే. అపాయకర పరిస్థితిలో భయంతో వణికిపోయి గావుకేకలు పెట్టింది ఈ పుద్గలుడే. సరే, టిబెటన్ సాధకులు రెండు మూడు నెలలు ఏకదీక్షగా ఈ ఆత్మను పరిశీలిస్తూ దాని విషయమై స్పష్టత ఏర్పరచుకొని ఆపైన విచారానికి దిగుతారు. విచార పద్ధతిని విపులంగా భవిష్యత్తులో చూస్తాము. విచారం అంతా అయ్యాక పుద్గలుడు స్వభావం లేనివాడని తేలిపోతుంది. ద్రవ్యసత్ (substantially existent) కాదని తేలిపోతుంది. ప్రజ్ఞప్తి సత్ (imputedly existing) అని తెలుస్తుంది. ప్రతీత్యసముత్పన్నం (dependently existing) అని తెలుస్తుంది.

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? "నావలన సత్త్వులు పరిమోచితులు (set free)" అని తథాగతుడు భావించునా? సుభూతీ, ఆ విధముగా భావించరాదు. ఎందులకనగా, తథాగతుని వలన పరిమోచితుడైన సత్త్వుడు ఎవడూ లేదు. తథాగతుని వలన పరిమోచితుడయిన సత్త్వుడు ఎవడైనా ఉండిన పక్షములో అదియే తథాగతునికి ఆత్మగ్రాహము (seizing on a self) అయియుండెడిది. సత్త్వగ్రాహము, జీవగ్రాహము, పుద్గలగ్రాహము అయియుండెడిది. ఆత్మగ్రాహము అని తథాగతుడు అగ్రాహమునే (no–seizing) భాషించినాడు. కానీ బాల పృథక్ జనులు* (foolish common people) దానిని పట్టుకొని యున్నారు. బాల పృథక్ జనులు అని తథాగతుడు అజనులనే భాషించినాడు. కనుకనే బాల పృథక్ జనులు అనబడినారు.

---

*బాల పృథక్ జనులు (foolish common people)అంటే పూరిగుడిసెల్లో నివసించే నిరుపేద జనులు అని దయ చేసి అర్థం చేసుకోరాదు. పృథక్ జనత్వం అంటే -ఆర్యధర్మాణాం అలాభః అన్నాడు వసుబంధు. పది సంయోజనాల్లో (fetters) కనీసం మూడింటిని (సత్కాయదృష్టి శీలవ్రత పరామర్శ, విచికిత్స) ఛేదించినవాడు పృథక్ జనత్వం నుండి విముక్తిని పొంది ఆర్యుడవుతాడు(noble person). కనుక విమానాల్లో ప్రయాణించేవాళ్లలోనూ బాల పృథక్ జనులకు కొదువ లేదు అని గమనించవలెను.

# 26. లక్షణములు (characteristics)

అవతారిక:- "చిన్నీ, టేబిల్ మీద ఫ్లాస్కు ఉంది తీసుకరా" వంటింట్లో నుండి తల్లి ఆజ్ఞ. టేబిల్ మీద అనేక వస్తువులున్నాయి. కానీ ఏడేండ్ల చిన్ని, ఫ్లాస్కును మాత్రమే తీసుకొని వంటింట్లోకి వెళ్లింది. ఇక్కడ వ్యవహారం సరళంగా జరిగిపోయింది. కానీ తార్కికులు దీని మీద మహాభారతం అంత చర్చ చేస్తారు. "ఒక వస్తువును తక్కిన వస్తువుల నుండి వేరు చేసి గుర్తించడం అనేది ఎలా జరుగుతుంది? ఆ గుర్తింపు దేని వలన కలిగింది? ఇతర వస్తువులలో ఉండని, ఆ వస్తువులో మాత్రమే ఉండే లక్షణం (mark) వలననే ఆ వస్తువు తక్కిన వస్తువుల నుండి వేరుగా గుర్తింపబడింది. ఆ విధంగా గుర్తింపబడిన వస్తువు లక్ష్యము అనబడుతుంది. గుర్తు లక్షణం అనబడుతుంది. లక్షణము లక్ష్యము వేరు వేరు అయినప్పటికీ ఒకటిగా కనిపిస్తున్నాయి కనుక వీటి రెంటి మధ్య విడదీయరాని సంబంధం ఉండి తీరాలి. దానికి పేరు సమవాయ సంబంధమని పెట్టుకొందాము..... " ఇలా చర్చ కొండవీటి చాంతాడులాగా సాగిపోతుంది.

Brain లో ఏమి జరుగుచున్నదో తెలియకుండా చేసే చర్చలన్నీ చాలా వరకు ఊహాగానాలుగానే ఉండిపోతాయి. గుర్తింపు విషయంగా బ్రెయిన్ ఏ పద్ధతి (rule) అవలంబిస్తున్నదో తెలియదు. వైజ్ఞానికులు దాని బరువును ఒకటిన్నర కేజీ అంటున్నారు. కానీ మన ఊపిరితిత్తులలో జరిగే పనిలో 20శాతం పని దానికోసమేనట! అలాగే గుండెకాయ చేసే పనిలోనూ ఇరవై శాతం దానికేనట! బ్రెయిన్‌లో పదివేలకోట్ల మేధోకణాలు (nerve cells) ఉన్నాయట. ఒక్కొక్క కణానికీ మరో కణంతో పదివేల సంధానములు (connections) ఉన్నాయట. మరి ఇంతటి అద్భుత పరికరంలో ఏమి జరుగుతున్నదో మనకు తెలియదు. అనుభవాలు (experiences), వేదనలు (feelings), సంజ్ఞలు (perceptions), విజ్ఞానములు (knowledges), స్మృతులు (memories), స్వప్నాలు (dreams) ఎలా కలుగుతున్నాయో మనకు తెలియదు.

క్రింది పేరాలో మళ్లీ మహాపురుష లక్షణాల ప్రస్తావన వస్తుంది. సిద్ధార్థుడు జనించినపుడు ఆ శిశువు లక్షణాలను చూసి లక్షణవేత్తలు "ఇతడు సర్వసంగపరిత్యాగియైన మహాజ్ఞాని అవుతాడు లేదా చక్రవర్తి (wheel turning monarch) అవుతాడు" అని జోస్యం చెప్పారు. కనుక మహాపురుష లక్షణాలు చక్రవర్తిలోనూ ఉంటాయని తెలుస్తున్నది. మహాపురుష లక్షణాల వరకే బుద్ధుణ్ణి పరిమితం చేస్తే బుద్ధుణ్ణి చక్రవర్తిని సమానులను చేసినట్లు అవుతుంది. కానీ బుద్ధుని స్థాయి ఎంత గొప్పదో మన ఊహకు అందదు. బ్రహ్మసహాంపతి లాంటివాడు బుద్ధునికి నమస్కరించి ప్రదక్షిణం చేసి చేతులు జోడించి ధర్మచక్ర ప్రవర్తనం చేయమని ప్రార్థించియున్నాడు. కనుక మనకు ఒకవేళ దివ్యదర్శనం (divine vision) కలిగి మహాపురుష లక్షణాలతో దేదీప్యమానంగా ఉన్న రూపకాయం కనిపిస్తే "నాకు సత్యం గోచరమయ్యింది" అని భ్రమలో పడిపోరాదు.

## అనువాదం

భగవానుడు:- సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? తథాగతుడిని లక్షణసంపద కలవాడుగా చూడవచ్చునా?

సుభూతి:- చూడరాదు భగవాన్. భగవానుడు భాషించినది నాకు అర్థమయిన ప్రకారముగా చెప్పవలసినచో తథాగతులవారిని లక్షణసంపద కలిగినవాడుగా చూడరాదు.

భగవానుడు:- సాధు సాధు (well said well said) సుభూతీ, లక్షణసంపదతో తథాగతుణ్ణి చూడరాదని నీవు నిజమునే పలికితివి. ఎందులకనగా, లక్షణసంపద కలవాడు తథాగతుడు అయిన పక్షములో చక్రవర్తి కూడా తథాగతుడు అయినట్లగును. కనుక లక్షణసంపద కలిగినవాడుగా తథాగతుడు చూడబడరాదు.

సుభూతి:- భగవానులు భాషించినది నాకు అర్థమయిన ప్రకారముగా తథాగతులను లక్షణసంపద కలవారుగా చూడరాదు.

ఆ తరువాత భగవానుడు క్రింది రెండు గాథలను (stanzas) పలికినాడు:

*యే మాం రూపేణ చాద్రాక్షుర్యే మాం ఘోషేణ చాన్వగుః*

*మిథ్యాప్రహాణప్రసృతా న మాం ద్రక్ష్యంతి తే జనాః*

*ధర్మతో బుద్ధా ద్రష్టవ్యా ధర్మకాయా హి నాయకాః*

*ధర్మతా చ న విజ్ఞేయా న సా శక్యా విజానితుమ్*

ఎవరు నన్ను ఒక రూపముగా (form) చూచినారో ఎవరు నన్ను శబ్దముల ద్వారా అన్వేషించినారో వారు మిథ్యాప్రయత్నము చేసినవారలే అగుదురు. వారు నన్ను చూడలేరు. ధర్మతగా (true nature of Dharmas) బుద్ధులను చూడవలెను. నాయకత్వము (guidance) ధర్మకాయమునదే. ధర్మత అనునది అవిజ్ఞేయము. కనుక దానిని ఒక విషయముగా (objectగా) తెలుసుకొనుట అసంభవము.



# 27. ప్రతీత్య సముత్పాదం

అవతారిక:- మధ్యమక శాస్త్రం ప్రారంభంలో ఉన్న రెండు మంగళ శ్లోకాలు:

*అనిరోధమనుత్పాదమనుచ్ఛేదమశాశ్వతమ్*
*అనేకార్థమనానార్థమనాగమమనిర్గమమ్*
*యః ప్రతీత్యసముత్పాదం ప్రపంచోపశమం శివం*
*దేశయామాస సంబుద్ధస్తం వందే వదతాం వరమ్*

*I offer salutation to the best of preachers, the Buddha, who has taught that dependent co-arising has no ceasing, no arising, no nullification, no eternity, no unity, no plurality, no arriving and no departing, that it is quiescent of all fictions, that it is blissful.*

*–translation by Robinson*

*మొత్తం మధ్యమక శాస్త్రం ఈ రెండు మంగళ శ్లోకాల్లో అణగియున్నది. ప్రతీత్య సముత్పన్నములకు (dependently originated) విశేషణాలు ఎనిమిదింటిని నాగార్జునుడు ఈ శ్లోకాల్లో ఇమిడ్చినాడు.*

*1. అనిరోధం = నిరోధము లేనిది. క్షణభంగం లేనిది అని అర్థం. దీని వివరణం కోసం దీపశిఖను తీసుకొందాము. దీపశిఖ మనకు ఏకరూపంగా కొనసాగుతున్నట్లు కనిపిస్తుంది. కానీ అక్కడ జరిగేది ఏమిటంటే ఒక flash తరువాత ఒక flash వేగంగా ఉత్పన్నం కావడం, అంతరించిపోవడం జరిగిపోతూ ఉన్నది. flash కి flash కి మధ్య gap సూక్ష్మంగా ఉండడం వల్ల క్షణభంగం మనకు తెలియడం లేదు. ప్రతీత్యసముత్పాదములో క్షణభంగం లేదు అంటున్నాడు నాగార్జునుడు. (క్షణం*

*(momentary thing) అనేది ఒకటి స్వభావతః ఉంటే కదా ఆపైన క్షణభంగం సిద్ధించేది! ఇక ఇతర విశేషణాలను వివరణం లేకుండానే చూస్తాము.)*

2. *అనుత్పాదం = ఉత్పాదం అంటే ఆత్మభావోన్మజ్జనం = gaining existence, arising, appearing అని కూడా చెప్పుకోవచ్చు. ఉత్పాదం లేనిది అనుత్పాదం.*

3. *అనుచ్ఛేదం = ఉచ్ఛేదం అంటే ప్రబంధవిచ్ఛిత్తి = cutting off the flow అని అర్థం. పైన తెలిపిన దీపశిఖను ఉఫ్ అని ఊదితే ఆరిపోతుంది కదా! దీపశిఖా ప్రవాహానికి ఉచ్ఛేదం జరిగిందన్నమాట. ఉచ్ఛేదం లేనిది అనుచ్ఛేదం (ప్రబంధం అనేది ఒకటి ఉంటే కదా అది ఉచ్ఛేదం అయ్యేది!).*

4. *అశాశ్వతం. శాశ్వతం అంటే నిత్యం (unchanging) అని అర్థం. శాశ్వతం కానిది అశాశ్వతం. ఈ విశేషణాన్ని బాగా గమనించాలి. ప్రతీత్యసముత్పన్నములకు అర్థక్రియా కారిత్వం (capable of performing the functions) ఉన్నది కనుక అశాశ్వతం. శాశ్వతములకు (unchanging) అర్థక్రియాకారిత్వం అసంభవం.*

5. *అనేకార్థం = not identical with causes.*

6. *అనానార్థం = not different from causes.*

7. *అనాగమం = రాక లేనిది.*

8. *అనిర్గమం = పోక లేనిది.*

*ఈ ఎనిమిది విశేషణాలు కలిగిన ప్రతీత్య సముత్పాదం = ప్రపంచోపశమము (cessation of all talk)= శివం = నిర్వాణం.*

అనువాదం

*భగవానుడు:–* సుభూతీ, నీవేమనుకొనుచున్నావు? లక్షణ సంపద వలన తథాగతుడు అనుత్తర సమ్యక్ సంబోధిని పొందెనా? సుభూతీ, అటుల చూడరాదు. ఎందులకనగా, లక్షణసంపద వలన నిశ్చయముగా తథాగతునికి అనుత్తర సమ్యక్ సంబోధి కలుగలేదు.

సుభూతీ, "బోధిసత్త్వయానికులు ధర్మముల వినాశనమును (destruction) ఉచ్ఛేదమును (annihilation) తెలియుచున్నారు" అని ఎవడయిననూ నీముందర పలికినచో అటుల పలుకనీయవద్దు. (ధర్మములను) నీవు ఆ విధముగా చూడరాదు. ఎందులకనగా, ఏ ధర్మము యొక్క వినాశనమునుగానీ ఉచ్ఛేదమునుగానీ బోధిసత్త్వయానికులు అంగీకరించరు.





# 28. ధర్మక్షాంతి

అవతారిక:- అష్టసాహస్రిక నుండి ఒకసన్నివేశం. బుద్ధుని అనుగ్రహబలంతో సుభూతి అక్కడి పర్షదంలో (assembly) ప్రజ్ఞాపారమిత గురించి ప్రసంగం చేస్తున్నాడు. ఆ సభలో ఉన్న శక్రుడు మిక్కిలి సంతుష్టుడై "ఆర్య సుభూతి భాషిస్తున్న ఈ ధర్మపర్యాయం (discourse on dharma) మహోన్నతంగా ఉన్నది. ఈ ధర్మపర్యాయము పట్ల నా భక్తిని తెలపడం కోసం దివ్యపుష్పములతో ఆర్య సుభూతిని పూజిస్తాను" అనుకొని తక్షణమే పుష్పములను సృజించి (conjured up) సుభూతి మీద వెదజల్లినాడు. ఆ పుష్పములను గురించి సుభూతి ఇలా అనదలచాడు: "ఇటువంటి పుష్పములను నేను పూర్వము చూచినది లేదు. ఇవి వృక్షముల నుండి జనించినవి కావు, గుల్మముల నుండి జనించినవి కావు. లతల నుండి జనించినవి కావు. ఇవి నిర్మిత పుష్పములు (conjured up flowers). కనుక మనోమయములు (mind-made)". సుభూతి మనస్సులో ఏమనుకొంటున్నాడో శక్రుడు తెలుసుకొని "ఆర్య సుభూతీ, ఈ పుష్పములు అనిర్జాతములు (did not issue forth at all). ఎందులకనగా, పుష్పములు ఏవియూ కూడా మనస్సునుండి పుట్టినవి కావు. వృక్షముల నుండి పుట్టినవి కావు. గుల్మముల నుండి పుట్టినవి కావు. లతల నుండి పుట్టినవి కావు. కనుక పుష్పములు అనిర్జాతములు కదా" అన్నాడు. సమాధానంగా సుభూతి "కౌశికా, ఏది అనిర్జాతమో అది పుష్పం కాదు కదా!" అన్నాడు. శక్రుడు మళ్లీ మాట్లాడలేదు. మనస్సులోనే ఇలా అనుకొన్నాడు: "అబ్బా, ఎంత గంభీరప్రజ్ఞుడు (profoundly wise) ఈ సుభూతి! పదప్రజ్ఞప్తిని (nominal existence) చాలా చక్కగా వివరిస్తున్నాడు! "

క్రింది పేరాలో అనుత్పత్తిక ధర్మక్షాంతి (patient acquiescence in dharmas) గురించి ప్రస్తావన ఉన్నది. మొత్తం లోకాన్ని interplay of impersonal forces గా చూస్తూ

*సంఘటనల పట్ల* Yes, Yes *అనే అంగీకారధోరణి మంచిది. వాస్తవాలను గుర్తిస్తూ జీవిస్తేనే శాంతి లభిస్తుంది.*

*అనువాదం*

*భగవానుడు:-* సుభూతీ, ఏకులపుత్రుడుగానీ కులదుహితగానీ గంగానది ఇసుకరేణువులు ఎన్ని ఉన్నవియో అన్ని లోకధాతువులను (world systems) సప్తరత్నములతో నింపి తథాగతులు, అర్హతులు అయిన సమ్యక్ సంబుద్ధులకు దానము చేసి సంపాయించెడి పుణ్యస్కంధము కంటెనూ ఏ బోధిసత్త్వుడయితే నిరాత్మకమైన అనుత్పత్తికమైన ధర్మముల ఎడల క్షాంతిని (acceptance, acquiescence, saying yes yes to facts) కలిగియుండునో అతడు అధిక పుణ్యస్కంధమును సంపాదించును. అది అప్రమేయము, అసంఖ్యేయము. (అయినప్పటికీ) బోధిసత్త్వుడు పుణ్యస్కంధమును గడించరాదు.

*సుభూతి:-* భగవాన్, బోధిసత్త్వుడు పుణ్యస్కంధమును ఎందులకు గడించరాదు?

*భగవానుడు:-* గడించవచ్చును కానీ స్వీకరించరాదు. (నేను సంపాయించాను. ఇది నాది అనే వ్యామోహం కూడదు). కనుకనే గడించవలెను అని చెప్పబడినది.



